
coromandel
gromor
GROMOR
N-P-K
14-35-14
కోరమాండల్ ఫెర్టిలైజర్స్ లిమిటెడ్



జెమిని సమర్పించు

# మంచిరోజులు వచ్చాయి

మాటలు: బొల్లిముంత శివరామకృష్ణ
సంగీతం: టి. చలపతిరావు
కెమెరా: సెల్వరాజ్

ఈస్ట్మన్ కలర్

దర్శకత్వం:
వి. మధుసూదనరావు

నిర్మాత:
ఎస్. ఎస్. బాలన్

'ప్రశ్నావళి' శీర్షికకి ప్రశ్నలను పంపేవారు కవరుమీద స్పష్టంగా 'ప్రశ్నావళి,' ఆంధ్ర సచిత్ర వార పత్రిక, మద్రాసు—1.' అని వ్రాయకోరుచున్నాము.— సం||



# ఉత్తరాలు

**ఓం నమఃశివాయ**

21—4—72 సంచికలో హనుమకొండ ప్రేమగారు సరస్వతీగిరి గార్ని ఉద్దేశించి రాసిన పద్యాలను చదివేసరికి నవ్వుతో పొట్ట చెక్కలయిపోయింది.

రూపాకుల అన్నపూర్ణ (హైదరాబాద్)

* * *

విజయవాడ నుంచి శ్రీయుతులు కమలాకరరావు గారు వగైరాల ఉత్తరం చదివాను. 'మొదటి పౌరుని భార్యగా, కవయిత్రిగా విమర్శకు అనువుగా' శ్రీమతి గిరి గారినందరూ ఎంచుతున్నారుట! నాకు తెలిసినంతవరకూ ఆమెను కవయిత్రిగా విమర్శించేరేమో గాని 'మొదటి పౌరుని భార్యగా' ఎవరూ విమర్శించలేదే! కందపద్యంలో యతి, ప్రాస గణాలు లేకపోవుట వారు 'అల్ప' మైన దోషంగా ఎంచారుట! అంతే కాదుట! ఏ కందపద్యమూ చెప్ప లేని భావాలేవో వాటిలో వున్నాయిట! భగవంతుని పూజించేటప్పుడు మనస్సులో మెదిలే భావతరంగాలకు మరి 'భారతదేశపు ప్రథమ మహిళ' 'తుచ్ఛాలు నిరసించెదరు' వగైరా పదాలే అవి వాలవు కాబోలు. పోతే అందులోని సుమారు ముప్పై శాతం పదాలకు ప్రపంచంలోని ఏ డిక్షనరీలోనైనా అర్థం చూపించగలరా? దిగంబరకవులు సైతం తమ స్వంత ధోరణిలో కుళ్ళిన సమాజాన్ని తిట్టారు, గానీ, కందపద్యపు వెన్ను విరుగ కొట్టలేదే! నేననేది ఒకటే, ఇవే గీతాలు శ్రీమతి గిరిగారు కాక వేరెవ్వరు రాసినా ఏ పత్రికలోనైనా ప్రచురించే వారా అని! పైగా ఆ బిరుదులేమిటి?

కొంతకాలం క్రితం ఒక ఉర్దూ కవి 'బహదూర్ నామా' అనే కావ్యాన్ని 'శ్రీ లాల్ బహదూర్' నకు వినిపిస్తే ఆయన 'దీని పేరు చూసి పూర్వకాలపు రాజులెవ్వరినో ఉద్దేశించి రాసారనుకున్నాను గాని నా గురించి రాసారనుకోలేదు. ఇంకెప్పుడూ అధికారంలో వున్నవారిని పొగుడుతూ రాయకండి' అని సందర్భించటం ఎలా మరువగలను?—

ఏ. రామమూర్తి (తణుకు)

* * *

ఆహా, శ్రీమతి సరస్వతిగిరిగారి కవిత్వం అమోఘం. వారికవిత్వం మాకెంతో ఆనందాన్నిచ్చింది. కందపద్యములు ఎంత సులువుగా వ్రాయవచ్చో శ్రీమతి గిరిగారు చాలాబాగా తెలిపారు. వారి పద్యములు చదివిన మాయింటి ప్రక్కన 4 వ తరగతి చదువుతున్న అబ్బాయి పది కందపద్యములు సొంతంగా వ్రాశాడు. అంత చక్కని పద్యములు ఇంతత్వరగా అయిపోవడం చాలా విచారించదగ్గ విషయము. త్వరలోనే శ్రీమతిగిరిగారు మరియొక శతకమును మాకు అందిస్తారని ఆశించుచున్నాను.

సి. అన్నపూర్ణ (విజయవాడ)

* * *

14—4—72 వ తేదీ సంచికలో ప్రచురించిన మా ఉత్తరంలో మేం పంపిన పద్యాన్ని తప్పుగా ప్రచురించారు. ఆపద్యంలో 'ఊ', 'ఏ', 'ఎ', 'ఈ' లతో ప్రారంభమయ్యే పాదాలున్నాయి. గమనించ ప్రార్థన.

—మోహన్, గిరిజ (విజయవాడ)

## వ్యాసాలు

బాంగ్లాదేశ్ శరణార్థుల సహాయార్థమంటూ ప్రభుత్వము విధించిన పన్నుల భారమును యింకా కొనసాగించుట అంత సమంజసముగా తోచుట లేదు. అసలే స్థానిక పన్నుల భారముతో క్రుంగి పోవుచున్న ప్రజలు ఈ అదనపు భారమును చాల కాలము మోయలేరు.

'తానుమాలి తావులేదు మొదట్ దోల'న్నట్లుగా మనమే ఆర్థికంగా నలగబడియున్నప్పుడు మరో దేశానికి 'మానవ ధర్మం' అంటూ యింకనూ సహాయము కొనసాగించుచూపినచో కడకు మనము శరణార్థులము అగుదుమేమో!

—గుడిపాటి వెంకయ్య (మద్రాసు)

* *

కన్నుల పండువగా, వీనుల విందుగా
మనసు మైమరపించేలా తయారైన చిత్రం!
ఇంటిల్లిపాదీ చూడవలసిన వినోద కాలక్షేపం!!



పూర్ణిమ పిక్చర్స్

# శ్రీకృష్ణాంజనేయ యుద్ధం

దర్శకత్వం: సి.యస్.రావు B.A.(Litt) నిర్మాత: డి.యస్.రాజు

ఆంధ్ర: తారకరామ - సీడెడ్: జయలక్ష్మి - మైసూర్: ఉషా - మద్రాస్: నవయుగ పిక్చర్ సర్క్యూట్

THARAKARAMA

## ఉత్తరాలు

14—4—72వ తేదీ సంచికలో (ఉత్తరాల శీర్షిక) ప్రసాద్‌రెడ్డి గారి ఉత్తరంచూసి నవ్వు ఆపుకుందామంటే పెదవులు విడవడలేదు. ఏడుద్దామంటే పెదవులు కదలలేదు. ముఖ చిత్రాలన్నీ స్త్రీలవే వేస్తే స్త్రీపురుషుల సమానత్వం వస్తుందా? భౌతికమైన మార్పులలో సమానత్వం వస్తే చాలని కాబోలు వీరి ఉద్దేశ్యం.

ఎస్. శరత్ కుమారి, కె. ఉమ. కె. విమల, కుమారి, డి. విజయలక్ష్మి, (తెనాలి)

* *

ఈ వారం (14—4—72) పత్రిక చదివాను. శాంతిప్రియ (గుంటూరు.) వారి ఉత్తరం నన్ను అమితంగా ఆకర్షించింది. విజయవాడ నుండి (సోదరులు కొందరు అక్కినేని నాగేశ్వరారావు గారు సినిమాలలో ద్వంద్వార్థం పాటలు— నటన నటించేవారిని ప్రోత్సహిస్తున్నారు అని వ్రాసారు.) ఇది వాస్తవంలో ఎంత మాత్రం 'సత్యం' కాదు!!! ఏనటుడు తన నటన ద్వారా దేశాన్ని— ప్రజలను దుర్భర పరిస్థితికి తీసుకుపోడు!!! తన నటనద్వారా తను నటించేపాత్రల ద్వారా దేశాన్ని మంచి త్రోవలో నడిపించాలని ప్రయత్నిస్తాడు!!! శ్రీ అక్కినేని ఆటువంటి నటులలో ఒకరు—ఆయన నటించిన సుడిగుండాలు—మరో ప్రపంచం—సిపాయిచిన్నయ్య—జై జవాన్— చిత్రాలుచూస్తే, ఎటువంటి వారికైనా ఈ కాలంలో దేశభక్తి జనించకపోదు. అంతటి అత్యుత్తమ చిత్రాలలో నటించి తెలుగు చలన చిత్ర రంగంలో సరిక్రొత్త మలుపుల్ని త్రిప్పుతూ ఆంధ్రులు గర్వించ తగ్గ నటుడుగా రోజురోజుకు తన నటనాశక్తిని పెంచుకొంటున్న నటుడు అక్కినేని — సెక్స్ చిత్రాల్లో నటించండి, నేను ప్రోత్సహిస్తాను—అంటే నమ్మలేని విషయం—

నేడు వ్యాపార దృష్ట్యా సినిమాలో 'సెక్సు' తప్పని సరిగా ప్రవేశ పెట్టడం చాలా మంది నిర్మాతలకు అలవాటయింది. అటువంటి వాళ్ళు తమ అభిప్రాయాలను నెమ్మదిగా మార్చుకోవాలని, దేశం అంటే యిది!!! మనకావలసినవి ఇలాంటి చిత్రాలు.. అనే క్రొత్త దృక్పథంలో 'సుడిగుండాలు'— 'మరో ప్రపంచం' నిర్మించారు. అక్కినేని. కాని మన తెలుగు ప్రజలు ఎక్కువ శాతం సెక్సు చిత్రాలను ఆదరిస్తున్నారు.!! 'పాత పురాణం కట్టి పెట్టాలి.' అంటున్నారు. కొందరు— ఇలాంటి తరుణంలో అక్కినేని వారు ఏ సమాధానం చెపితే ప్రజలు వింటారు...!!!. ???

—జోగిమహాంతి సుధాకరరావు (రాయిగర్)

### పిచ్చాపాటీ

ముఖచిత్రం రాజశ్రీ హిందీతారలాగ నాజూగ్గా అందంగా ఉంది. యన్. టి. ఆర్. తనకుమారునితో ఉన్న స్టిల్ ముచ్చటగా ఉంది. పోతే మోహన్ కుమార్ గారు 'పిచ్చాపాటీ'లో చలనచిత్రపరిశ్రమను— క్రుంగదీస్తున్న పన్నులు గురించి వివరిస్తూ, నలుపు తెలుపు చిత్రం ప్రింటు ఒకటికి ఇపుడు 10 నుండి 15 వేలవరకూ అవుతుందన్నారు. నలుపు తెలుపు చిత్రం ప్రింటు ఒకటికి (ఇప్పుడు పెరిగిన ఎక్సయిజ డ్యూటీతో సహా) 6 నుండి 9 వేల వరకు మాత్రమే ఉండగలదని గమనించ ప్రార్థన.

నల్లూరు శ్రీనివాస వ్యాటన్‌బాబు, విజయవాడ.)




# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 19-5-72

(శ్రీవరీధావినామ సం॥ విజవైశాఖమాస॥ శుద్ధసప్తమి

సంపుటము: 64 సంచిక: 39

స్థాపితము: 1908

సంపాదకుడు
శివలెంక శంభుప్రసాద్

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి. మద్రాసు - 1

విడిప్రతి వెల 50 పైసలు

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 31·20 |
| 6 మాసముల చందా | 15·60 |
| 3 మాసముల చందా | 7·80 |


## విషయానుక్రమణిక

ముఖచిత్రం: నటి జయ.
(ఫోటో: శ్రీ యు. బాలకృష్ణన్)


ప్రధాని మమ్మల్ని బలపరుస్తారు
కాదు. మమ్మల్నే ప్రధాని బలపరుస్తారు
జాతిశ్రేయస్సు కోసం మీరిద్దరూ కలిసి ఉండాలి
ఆంధ్రలో అధికార పక్షం
తిరుగుబాటు దారులు


ముందు అఖాతం
వెనుక భూతం
వియత్నాంలో పరాజయ పరిణామాలు
వియత్నాంలో యుద్ధాన్ని కొనసాగిస్తే ....


భారత్-పాక్
శిఖరాగ్ర సభ
శిఖరానికి మార్గం కఠినం


మావో కొత్త వంశాంకురం
మే 1వ తేదీన కేరళలో మావో అడుగు జాడలలో కొత్త తీవ్రవాద పక్షం ఒకటి ఉద్భవించింది.
కమ్యూనిస్టు యూనిటి సెంటర్

# మేష్టారూ! ప్రయివేటు చెప్పరూ!



వి. అరుంధతీ సుబ్రహ్మణ్యం

కాలేజీ ఆవరణంతా కిటకిట లాడి పోతోంది. విద్యార్థులంతా అటు యిటు తిరుగుతున్నారు. అందరి వదనాలలో వేదన, విచారం, కోపం ప్రస్ఫుటమవుతున్నాయి. తలోమాటా అనుకొంటున్నారు. పరుగులు తీస్తున్నారు కొందరు. గుంపులు, గుంపులుగా చేరి యేవో అనుకుంటున్నారు. గుసగుసలాడుతున్నారు. అర్థంకాని జనం, వింతగా చూస్తున్నారు. ఎప్పుడూ వున్న గొడవేలేవని, తల వంచుకొని పోతున్నారు కొంతమంది బుద్ధిమంతులు. అల్లరి చేయటానికిదే సదవకాశంగా భావిస్తున్నారు కొందరు. అంతటికీ కారణం, ఆ కాలేజీలోనే ఫైనలియర్ చదివే గోపీనాథ్ అనే విద్యార్థి మరణం. మరణం కాదు, ఆత్మహత్య! దాని ఫలితమే యీ గడబిడంతాను.

ప్రిన్సిపాల్ రూముముందు నిలబడ్డారంతా. వారి నాయకుడు కలుగజేసుకుంటూ, 'సార్! గోపీనాథ్ ఆత్మహత్య చేసుకున్నాడు' అన్నాడు. తనకు తెలిసిందన్నట్లుగా తలవూపి, 'అయితే ఏం చేయాలి' అన్నట్లుగా చూసేరాయన. ఆ చూపుకి ఆ విద్యార్థికి ఒళ్ళు మండింది. అరికాలిమంట నెత్తికెక్కింది.

'అతని చావుకి మీరంతా బాధ్యులే సార్' కోపంగా అన్నాడు.

'కాలేజీలో యెన్నో జరుగుతూ వుంటాయి. అన్నిటికీ మా బాధ్యతేనంటే యెలా చెప్పవోయ్! చదువు చెప్పటంవరకే మా పని.' అని ఆగేరు. తిరిగి ఆయనే అందుకొంటూ, 'పాపం! పిల్లవాడు బుద్ధిమంతుడు. ఫూల్ ఫెలో ఏ ప్రేమ వ్యవహారంతో పడ్డాడో', చాలా నిదానంగా, అన్నారు. విద్యార్థులలో కలకలం రేగింది. 'ప్రిన్సిపాల్ డౌన్, డౌన్', అని మెల్లగా కేక లేస్తున్నారు.

ఆ నాయకుడు అందుకుంటూ, 'అదే సార్ మీ తప్పుడు అంచనా! ఒకటే కారణాన్ని అందరి చావులకి చూపించి, మీ తప్పేంలేదని భావించకండి సార్! గోపీ మరణానికి మీ యందరి అశ్రద్ధలు, అసమర్థతలు, డబ్బు ఆశ. డబ్బాశ సార్!' కసిగా గట్టిగా క్రోధంగా అన్నాడు.

'వాట్! మిస్టర్!' నొసలు చిట్లిస్తూ అడిగేరు.

'నిజం! ఇదిగో యీ పుత్తరం చదివి

వినిపించండి. అందరికీ బోధపడుతుంది,' అని వినమ్రంగా ఒక కవరును ఆయనముందు విసిరేడు.

అందరి కళ్ళు ఆ కాగితంపై కేంద్రీకృతమయింది. చెవులు నిక్కబొడుచుకొని విషయాన్ని తెలుసుకోడానికై ఎదురు చూస్తున్నారు. నిశబ్దంగా వుంది. కళ్ళజోడు సవరించుకుంటూ, ప్రిన్సిపాల్ గారు చదవటం మొదలు పెట్టేరు.

'మిత్రులారా! మీ అందరితో కలిసి, మెలసి తిరగాలని, కులాసాగా వుండాలని నాలో ఆశలు, కోరికలున్నాయి. కాని అందరికీ అనుకుంటే దొరికేవి కావు యివి. కొందరు వాటి జోలికి వెళ్ళేందుకు కూడా వీలు లేనంత దూరంలోకి విసిరివేయబడతారు. ఆశలుండటం సహజం. కాని నెరవేరే మార్గం కనిపించాలిగా!

నేను మధ్యతరగతి కుటుంబంనుండి వచ్చినవాణ్ణి. తోడబుట్టిన వాళ్ళందరూ వున్నారు. మా నాన్న చాలీ చాలని జీతంతో యింత సంసారం గడుపుకుని వస్తున్నారు. మా నాన్న పెద్ద చదువులు చదవలేదు. ఆ కాలంలో అంతగా చదువులు కూడా అవసరం. తను చదవకపోయినందువల్లే యీనాడు తానిలా కష్టపడవలసి వస్తుందని ఆయన నమ్మకం. అందుకే తన పిల్లల్ని చదివించాలని, పెద్దవాళ్ళని చేయాలని ఆయన తాపత్రయం.

అందుకనే రాత్రింబవళ్ళు ఆఫీసులోను, పార్టుటయిము జాబ్‌ను చేసుకొంటూ శరీరానికి విశ్రాంతి అనేది లేకుండా, శ్రమించే కష్టజీవి వారు. వారి బాధను, కష్టాలను అర్థంచేసుకుని, నాలో నేను మథనపడే వాడిని. హైస్కూలు చదువు యెలాగో కానిచ్చేను. కాలేజీలో చేరాలంటే డబ్బుతో పని. అమ్మకి మాత్రం యీ చదువులంటే, యేమాత్రం యిష్టంలేదు. 'ఎందుకంట! అలా కాలేజీలకని డబ్బు తగలేయడం? పెద్దవాడు డిగ్రీ తీసుకుని యేం చేస్తున్నాడు? బొగ్గు గనులలో కూలికి వెళ్ళేడు. నీదూ అంతే! ఏదో నౌకరీలో పెట్టండి. వాడే బాగుపడ్తాడు. ఆ డబ్బుతో పిల్ల పెళ్ళైనా చేయొచ్చు.' అనేది. నిజం కూడా అంతే!

అన్నయ్య బి. ఎ. పట్టా పుచ్చుకొని రెండేళ్ళపైగా అయిందే. ఎక్కని గుమ్మం లేదు. అన్నిటికీ అప్లయి చేసేడు. చివరకు మిగిలింది బాధే! విసిగి, విసిగిపోయిన అన్నయ్య, ఈ చదువులు ఎందుకూ పనికి రావంటూ, బొగ్గుగనులలోకి కూలీకి బయలుదేరి వెళ్ళేడు. ఇదీ వాడు చదివి చేస్తున్న పని. అమ్మ మనసు దీనివల్లే కష్టపడింది. నాన్నకి తెలుసు, గాని, తన పిల్లల్ని పైకి చదివించవలసిన బాధ్యత తండ్రిగా ఆయనకు వుంది అంటారు. ఆయన పంతం వల్లే నేను కాలేజీలో చేరేను. ఎలా డబ్బు తెచ్చేవారో, ఏం చేసేవారో, ఆ దేవుడికే తెలియాలి. ఆరోగ్యం కూడా చూసుకోకుండా శ్రమించే నాన్నను చూస్తుంటే కడుపులో దేవినట్లయేది. కష్టపడి చదివేవాడిని. తెలియని విషయాలు తెల్సుకునే వాడిని. మంచి మార్కులు సంపాదించే నన్ను చూసి నాన్న పరవసించేవారు అప్పుడప్పుడు. కాని పైకి గంభీరంగా కనబడుతూ, 'గోపీ! నా ఆశలు నెరవేర్చరా!' అని మాత్రం అనేవారు. ఎలాగో అలాగ చివరి సంవత్సరంలోకి అడుగు పెట్టేను.

ఈ పరీక్ష గట్టెక్కితే నేనూ డిగ్రీసంపాదించేనని సగర్వంగా చెప్పుకోవచ్చు. మంచి మార్కులతో ప్యాసయితే పై చదువులకి స్కాలర్‌షిప్ సంపాదించవచ్చు. పెద్ద ఉద్యోగస్థుడనవచ్చు. నాన్న కష్టాలుగడిచి బయటపడ్తారు. ఇలా ఎన్నో, ఎన్నో బంగారు కలలు కన్నాను.

ఆ సంవత్సరం సరిగా పాఠాలు జరగలేదు. విద్యార్థుల సమ్మెలవల్ల నయితే నేమి, లెక్చరర్లు సరిగా చెప్పనందువల్ల నయితేనేమి. జరగవలసిన పాఠాలు పూర్తి కాలేదు, పరీక్షలు వస్తున్నాయి. ఎంత శ్రద్ధగా చదివినా, శ్రమపడ్డా; జరగని పాఠాలు అర్థం చేసుకోలేక పోయేను. ఈ పరీక్ష ప్యాసవుతాననే ధైర్యం నాలో నెమ్మది నెమ్మదిగా తగ్గసాగింది. దిగులు పట్టుకుంది. ఇన్నాళ్ళ కష్టం వృధా అవుతుందేమోనని భయం. పరీక్ష ఫీజు కట్టాలంటే నాన్న పడ్డ శ్రమా, కష్టం తలుచుకుని వణుకు పుట్టింది. ఒకసారి తప్పేనంటే నాన్న వేదన చూడశక్యంకాదు. మార్వాడీ కొట్టులో పద్దు పెరుగుతుంది. ఇంట్లో తిండికి యిబ్బంది వస్తుంది. అబ్బ! ఎలా చూడను యివన్నీ?! ఒక్కసారి పోయినట్టైతే పరిస్థితే పూర్తిగా మారిపోతుంది. ఇవన్నీ నా మెదడులో గిర్రున తిరుగసాగేయి. ఈ దిగులుతో యింట్లో యేలాగో వుండేవాడిని. దానిని చూసినాన్న, 'ఒరేయ్! గోపీ! ఇది ఆఖరి సంవత్సరం ఈ పరీక్ష ప్యాసయావంటే, ఆతర్వాత సంగతి చూడొచ్చు. నామాట నిలబెట్టావని, నా ఆశ నెరవేరుతుందని గంపెడంత ఆశతోవున్నాను. గోపీ! శ్రద్ధగా చదవరా!' అని అన్నారు. ఆ మాటల్లోనే ఆయన యెంత ఆశపెట్టుకున్నారో తెలుస్తుంది. అమ్మకూడా అప్పుడప్పుడు హెచ్చరించేది. వారికెలా చెప్పను? ఎలాతెలుస్తుంది నా ఆవేదన? చదువుమీద అశ్రద్ధ లేదని చెప్పినా నమ్ముతారా? ఒకరోజు చెప్పలేక, చెప్పలేక అన్నాను.

'నాన్నగారూ! ఈసారి క్లాసులో పాఠాలు సరిగా జరగలేదు;' ఇంకా ఆ మాటను పూర్తిగాకాకుండానే అందుకొన్నారాయన, 'అయితే యీసారి తప్పుతావంటావు. అవునురా! నీకెలా తెలుస్తుంది నా కష్టం. మీరు సంపాదిస్తూ చదువుకొన్నప్పుడు తెలుస్తుంది రా! ఎవరో డబ్బులిస్తుంటే యిలాగేవుంటుందిరా. ప్రతిరక్తంబొట్టూ మీకోసం ధారపోసి మిమ్మల్ని యేదో చేద్దామని ఆశపెట్టుకోవటం నాదే తప్పురా! కష్టపడి సంపాదించిన డబ్బును వృధా పాలుచేయడానికిఎవరిచ్చారురా,హక్కు మీకు? ఛీ! ఛీ! ఈ కాలం పిల్లలకి చదువన్నా ఉపాధ్యాయులన్నా, తల్లిదండ్రులన్నా యేమాత్రం గౌరవం లేదు. ఏదైనా అంటే సమ్మెలు, కొట్లాటలు. పిల్ల పాడైపోయింది. ఛీ! నా ముందునుండి కదలవా! పోనీలే! ముందుగానే తప్పుతానని చెప్పేవు. చాలా సంతోషం. ఇప్పుడే ఆ ఆశకు నీళ్ళు వదులుకొంటాను.' అంటూ విసురుగా తుండుగుడ్డ భుజంమీద వేసుకొని వీధిలోకి నడిచేరు. అమ్మ కళ్ళ నీళ్ళు పెట్టుకొంది. ఆయనకి చెప్పుకోలేనంతకోపం, బాధవచ్చినప్పుడు అలా బయటకు వెళ్ళటం అలవాటు. నా మనసులో వున్నమాట యింకా పూర్తిగా చెప్పకుండానే యింతలేసి మాటలు అన్నారు. చెప్పేనా! ఇంకా ఎలాంటి మాటలు వినవలసివచ్చేదో! ఎప్పుడూ అమ్మను నన్ను గట్టిగా కోప్పడి ఎరగరు. ఈ రోజు ఆయన మాటలకు నాకు...' ప్రాయ

# మేష్టారూ!...

లేను దాన్ని.

ఆ రాత్రంతా నిద్రపట్టలేదు. దీనికి మార్గంయేమిటి? ఇలా ఆలోచిస్తూ కలత నిద్రతోనే గడిపేను. మర్నాడు మామూలుగా తయారయి కాలేజీకి వెడుతున్నాను. నాన్నగారుకూడా అప్పుడే బయటకు వచ్చారు. వరండాలోవున్న నన్ను చూసి, దగ్గరగావచ్చి, 'గోపీ! నిన్ను యేదో అన్నానని మనసు కష్టపెట్టుకోకు. డబ్బు చికాకులో నుండటంవల్ల చిరాకుపడ్డాను. నువ్వు బాగా చదివేవాడివని తెలిసివుండి కూడా మాటలన్నాను. గోపీ! పోనీ యెవరినైనా అడిగితెల్సుకో బాబూ!

మనలాంటి లేనివాళ్ల గతి యింతే బాబూ! ఉన్నవాడికే స్కాలర్‌షిప్‌లు, ప్రమోషన్లు, పెద్ద ఉద్యోగాలు. మనం అంచాలివ్వలేం. పలుకుబడి ఉపయోగిద్దామన్నా, నేను ఎందుకు పనికిరాని గుమాస్తాని. నా మాటకి విలువేది? ఏ పెద్ద ఉద్యోగస్థుడి కొడుకో నీలాగే మార్కులు తెచ్చుకొనివుంటే యీపాటికి వాడికి అన్ని వసతులు జరిగేవి. కాని, మన పాపం యిలా వుంది. ఎవర్నినీ ప్రయోజనం లేదు. నాలాంటివారు పిల్లల కోరికలు తీర్చలేని అసమర్థులు బాబూ! నీ తండ్రి యింతకన్న యేమీ తేలేడు. ఇప్పటికే శక్తి పోయింది. మునుపటిలాగ డబ్బు సంపాదించలేను. అప్పు లెక్కువయాయి. కడుపు నిండా తిండి, కంటినిండా నిద్ర కూడా కరువయే రోజులు దగ్గరపడుతున్నాయి. ఈ సమయంలో నువ్వు ప్యాసయి, ఖర్చు చేసిన డబ్బుకు ఈ ఫలితం దక్కితే మేలు. ఎవరి కాళ్ళూ పట్టుకుని ఉద్యోగం సంపాదిద్దాం! ఇలా ఆశించటం నీ తండ్రి తప్పా! పోనీలే బాబూ! నీ చేతనైనంత వరకు శ్రమపడు. ఆ తర్వాత భగవంతుడిదే భారం,' కళ్ళల్లో తిరిగే కన్నీళ్లను అపుకుంటూ బొంగురు కంఠంతో అన్నారు. హృదయం కలిచివేసింది. రాత్రిపడ్డ బాధంతా కన్నీరై ప్రవహించింది నాకు.

'లేదు నాన్నా! నేను తప్పకుండా ప్యాసవుతాను. నీకేం బెంగ వద్దు. అనవసరంగా మిమ్మల్ని నొప్పించేను. దిగులు పడకండి నాన్నా!' అన్నాను. ఆ తర్వాత నేను కాలేజీకి వెళ్లేను.

మనసులోయెంత బాధ వున్నా, పాఠాలు శ్రద్ధగా వింటున్నాను. అల్లరి మూకలతో తిరిగే అలవాటు లేదు. ఆడపిల్లల జోలికి వెళ్ళేవాడినికాను. నా పనేదో నేనేదో అంతే! అందుకే కొందరికి నన్నంటే అయిష్టం. మంచి మార్కులు రావటంవల్ల కూడా, కొందరికి అసూయగా వుండేది. ఏది యెలావున్నా నాకందరూ మిత్రులే!

నాన్నగారు అన్నమాటలు పదే, పదే గుర్తుకు వచ్చాయి. మనసులో అనేక రకాలైన ఆలోచనలు కలుగుతున్నాయి. చివరకు ఒక నిర్ధారణకు వచ్చేను. ఆ సాయంకాలమే వొక సబ్జక్టుకుచెందిన లెక్చరరు యింటికి వెళ్లేను.

గుర్నాథంగారు పిల్లలకి ట్యూషన్లు చెప్తున్నారు. అంతమంది పిల్లలతో వున్న ఆయనను పలకరించటం యిష్టంలేక వెనక్కు తిరిగేను. ఈ సమయం దాటితే తిరిగి ఆయన కనిపించరేమోననే సందేహం తిరిగి నన్ను పీడించసాగింది. ఆ సందుమొగలోనే నిలబడి వారింటివైపే చూస్తూ వున్నాను. నిముషాలు భారంగా గడుస్తున్నాయి.

ఎనిమిది గంటలకి మేష్టారిని కలిసేను. ఆయన నన్నుచూసి. 'ఏంకావాలి గోపీ?', అన్నారు. అసలు విషయం చెప్పడానికి భయం వేసింది. కాని నన్ను నా మనసు అన్నివిధాలా వత్తిడి చేయటంవల్ల ధైర్యంగా ఆయనకు విషయం చెప్ప తప్పిందికాదు.

'మేష్టారూ!! పొర్షన్సుకాలేదు. పరీక్షలు వస్తున్నాయి;' ఆగేను.

'అయితే యేం చేయమంటావోయ్?; గట్టిగానే అన్నారు. కొంచెం సర్దుకుని. 'మేష్టారూ! నాకు ప్రయివేటు చెప్తారా?' నేను అడిగిన తీరుచూస్తే నాకే యెలాగో ననిపించింది.

'అదేమిటోయ్! చిన్న పిల్లాడిలాగ, 'చెప్తారా?' అని అడుగుతున్నావు? రేపటినుండేరా! దానికేం నిక్షేపంలాగ చెప్తాను' అని అన్నారు.

'అదికాదండీ! మా సంగతి మీకు తెల్సును. అందుకని...' చేతులు నలుపుకొంటూ ఆగేను.

'సూటిగా చెప్పవోయ్.'

'మీకు డబ్బు యివ్వలేను. ఇంట్లో పరిస్థితి బాగులేదు. ఎలాగో యీ పరీక్ష

# సింథాల్ ఇచ్చే వాగ్దానం...

సంపూర్ణ లావణ్య పోషణ

నిత్య నూతన సౌరభం

సార్థక దుర్గంధ నివార్య రక్షణ

## ...నిలబెట్టుకో కలిగింది సింథాల్ ఒక్కటే




సింథాల్ ఒక్కటే జి-11 కలిగియున్న సబ్బు.
ఈ అద్భుతమైన క్రిమి సంహారక పదార్థము, శరీర
దుర్గంధమును, చర్మ లోపములను కలిగించు
క్రిములను రూపుమాపుతుంది. ఈ విధంగా సింథాల్
మీ లావణ్యమును నిష్కళంకముగా వుంచి,
మిమ్ము రోజంతా తాజాగా వుంచుతుంది.

Interpub/GSC/5/72R Tel

కాపీచేస్తేనంటే, మాకెప్పుడూ తగ్గేటట్టు కొట్టుకుంటాయి;' ఎలాగో ధైర్యంచేసి అసలు విషయం బైట పెట్టేను.

'ఓహో! అదా సంగతి! అందుకనా యీ నాస్నుడు వ్యవహారం! అదేం జరగదు' నిక్కచ్చిగా అన్నారు.

'మేష్టారూ! పేదవాళ్ళం. తిండికే కటకటలాడి పోతున్నాం. మా నాన్న నాపై గంపెడంత ఆశపెట్టుకున్నాడు. పాఠాలు అర్థం కావటంలేదు. పోర్షన్సు అవలేదు. పరీక్ష వ్యాసయే...'

"అయితే నేనేం చేయాలోయ్!", కర్కశంగా వున్నాయి ఆయన మాటలు.

'పేద బాలుడి మీద దయతలచండి మేష్టారూ! ఈ ఉపకారంచేసి పెట్టిరంటే మీ మేలు యెన్నటికీ మరువలేను.'

'గోపీ! అనవసరంగా మాటలు పెంచకు. నీకు కాలేజీ అడ్వాన్సుగా యివ్వవలసిన డబ్బుకు నెలరోజులు గడువు యిస్తున్నాను.'

'హా! ఫీజు కూడా కట్టడానికి యిబ్బందిపడే నేను అడ్వాన్సుకూడా నా మేష్టారూ?'

'అవన్నీ కాలేజీలో చేరేముందే ఆలోచించాలి. అయినా నాకెందుకు యివన్నీ, డబ్బుంటేనే మాట్లాడు. నీ యిష్టం' అన్నారు.

అప్పటికే నాలో సహనం నశించింది. కోపం రాసాగింది. ఈరోజు నే నిలాగవచ్చి అడిగేనంటే కారణం వేరే!

'మేష్టారూ! నిజం! క్లాసులు శ్రద్ధగా వింటే సరిపోతుందనుకునేవాడిని. కాని డబ్బుంటేనే కాలేజీ గట్టెక్కుతానని తెలుసుకోకుండా చేరటం నాదే తప్పు మేష్టారూ!

# మేష్టారూ!...

సక్రమంగా క్లాసులలో పాఠాలు చెప్పి వుంటే, నేనిలాగవచ్చి మిమ్మల్ని అడిగి వుండేవాడిని కాను, విద్యార్థులమీదే నెపం నెట్టి సమయం చిక్కిందే చాలని క్లబ్బుల్లో గంటలు గంటలు గడిపేవారు. బయటకు ఉడాయించేవారు. పరీక్షలప్పుడు యీ పిల్లలే మీ దగ్గరకు ట్యూషన్లకి వస్తారనే విషయం కూడా మీకు బాగా తెలుసు.'

'గోపీ! మాటలు బాగానే నేర్చేవే! క్లాసులో పాఠాలు వినకుండా కాలక్షేపం చేసి, యిప్పుడు ఆ నేరం మామీద నెట్టడం మీకు అలవాటయింది. అందితే జుట్టు, అందకపోతే కాళ్ళు.'

'మీ మనస్సాక్షిగా చెప్పండి మేష్టారూ! మీరు నిజంగా పాఠాలు సరిగా చెప్పేరా? చెప్పినది అర్థమయేలాగు బోధించేరా? మీకెలాగైనా నెలకి జీతాలు వస్తాయి మేష్టారూ! మీరెలా చెప్తున్నారని అడిగేవారు లేరు. కాని మా సంగతి అలా కాదుగా!'

'చాల్లే. ఏదో బుద్ధిమంతుడు అనుకొంటే వ్యవహారం చాలా దూరమే వచ్చిందే!' అంటూ లేచేరు. ఇంతలో వారి భార్య అన్నపూర్ణమ్మగారు వచ్చేరక్కడికి.

'ఏమండీ! గోపీ తెలివైనవాడు ఎప్పుడు మిమ్మల్ని యేమీ అడగలేదు. పోనీ యీ కొద్దిరోజులు చెప్పండి. మీపేరు చెప్పుకొని...' ఆమె అంటూవుండగనే,

'ఊ! నీకూ వచ్చింది యీ జాడ్యం. ఇంకవాళ్ళింటికి వెళ్ళటానికి వీలులేదు ఇక మీదట' అన్నారు కోపంగా. వాళ్ళ ఆవిడకు అనవసరంగా మాటలు రావటం యిష్టంలేక నాలోని కోపాన్ని అణచుకొంటూ, 'మేష్టారూ! మీరు పెద్దవారు. పిల్లలకి మంచి, చెడ్డలను, నీతులను బోధించేవారు. ఇంతగా సంపాదిస్తూ, యీ పేదవాడికి ఉచితంగా చెప్పలేరా? ఇంటి పరిస్థితులు బాగులేవు. పరీక్షపోతే నాన్న బాధపడ్తారు. చేతిలో డబ్బులులేవు. అందుకనే మీ దగ్గరకు వచ్చి బతిమిలాడవలసి వచ్చింది. పాఠాలు సరిగా జరిగినంటే నేనే శ్రమపడేవాడిని. మీ యింటెదురు చాకిరీ చేస్తాను. నా కుటుంబాన్ని ఆదుకోవాలి మేష్టారూ! నాకీ ఉపకారం చెయ్యండి మేష్టారూ! కోపంలో యేదో అన్నాను నన్ను క్షమించండి. నామీద దయ తలచండి మేష్టారూ!' ఆయన పాదాల మీద పడి వేడుకున్నాను.

ఆయన భార్యవైపు తిరిగి, 'పో! లోపలికి.' అన్నారు. ఆ ఇల్లాలు దీనంగా చూసింది నన్ను. మేష్టారు విసురుగా లోపలికి వెళ్ళేరు. ఇంక గతిలేక నిరాశతో, అవమానంతో వీధి ముఖం పట్టేను. మాష్టారు గారి ముఖం చూడాలనిపించలేదు. ఆయన వదనంలో కనిపించే నిష్ఠురోక్తులు ఆవేదనను చూడలేను.

ఆయన ఆశలను కూకటి వేళ్ళతో పెళ్ళగించేస్తున్న దుర్మార్గుణ్ణి నేను. నామీద నాకే కోపంవచ్చింది మేష్టారూ అలా కచ్చితంగా అడగగలిగేరంటే దానికి కారణం డబ్బున్న తల్లిదండ్రులు. వారి పైకపు బయలుదేరింది. క్లాసులలో సరిగా పాఠాలు చెప్పకుండా ట్యూషన్లతో కడుపు నింపుకుంటున్నారు మేష్టర్లు. ఎలాగో అలాగ పిల్లలు గట్టెక్కితే చాలు అని వందలు, వందలు

హరిరామ్









మీ ముఖ కాంతికి
కొన్ని కళలను
తీరుస్తుంది




మెత్తగా,
మృదువుగా,
యౌవనంగా
వుంచుతుంది-ఏదో తెలుసా ?
పాండ్స్ వ్యానిషింగ్ క్రీము. అందులో గల ప్రత్యేకమైన హ్యూమెక్టెంట్ దుమ్ము వాతావరణాలకి తగిన సంరక్షణను ఇచ్చుటయేగాక చర్మానికి సహజంగా వుండవలసిన ఆర్ద్రతకు భంగం రానీయదు. తేలికగా మంచులా వుండే పాండ్స్ వ్యానిషింగ్ క్రీము వాడండి. మ్యాట్ ఫినిష్‌కు దానిని ఒక్కటే వాడవచ్చు. లేకపోతే మీ సింగారం చెక్కు చెదరకుండా గంటలకొద్దీ వుండడానికి పౌడర్ పునాదిగా వుపయోగించవచ్చు. 4 సైజులలో లభించగల వ్యానిషింగ్ క్రీము ఇదొక్కటే: ఎకానమీ - లార్జి - మీడియము - స్మాలు.

## పాండ్స్ వానిషింగ్ క్రీమ్

విశిష్టమైన పౌడరు పునాది.

చీస్‌బ్రో పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్.
(పరిమిత బాధ్యతతో యు. ఎస్. ఎ లో స్థాపితము)

## మేష్టారూ!...

తగలేస్తున్నారు పిల్లల తల్లిదండ్రులు. అన్నిటికీ సమ్మెలుచేసే యీ విద్యార్థులు యిలాంటి విషయంలో యెందుకు జాప్యం చేస్తున్నారో తెలియదు. వారి బుర్రలకే తట్టలేదా మరి!

'పాఠాలు సరిగా చెప్పండి. ట్యూషన్లకు రాము' అని గట్టిగా అందరూ అంటే! 'యెవ్వరూ వెళ్ళకపోతేనో!' అలా జరిగితే మేష్టారిలా అడిగేవారుకారు. నాలాంటి వారికి గతిపట్టేదికాదు. నా మాటలు వినే నాథుడు లేడు. మేష్టారు అడిగిన డబ్బు తలుచుకొనేసరికి వళ్ళు ఝల్లుమంది. కష్టపడి చదివే నాలాంటి వారికి వందలు వందలు డబ్బు యెలాతేగలరు? అన్నిటికీ కారణం. అశ్రద్ధ, నిర్లక్ష్యం. ఇలా పరి పరివిధాలా నాలో ఆలోచనలు రేగి, చివరకు దానికి కారణం మేష్టారే అనిపించింది. నాకు ఉచితంగా చదువు చెప్పటంవల్ల మేష్టారికి కలిగే నష్టం? 'డబ్బు'. ఆమాట నెదిలి వెర్రిగా నవ్వుకున్నాను.

అందరినీ అనకూడదు. నాలాంటి దౌర్భాగ్యులుపుట్టడమేతప్పు ఇలాంటివారిని బ్రతికించటం భగవంతునిది తప్పు. తిరిగి, తిరిగి, కనబడని ఆ భగవంతునిమీద పోయిందికోపం. అందరినీ తిట్టుకుంటూ యిల్లుచేరేను. పుస్తకం తెరిచినా, మనసు యెక్కడో తిరుగులోంది కొన్ని పోర్షన్సు అవలేదు. చదివితే తలకెక్కటంలేదు. అక్షరాలు గజిబిజిగావున్నాయి నా కంటికి. నా ఒక్కడికే కాదు. ఎవ్వరికీ అర్థంకాలేదీపాఠాలు. ఆవిషయాన్ని వారంతగా పట్టించుకున్నట్లు లేదు. కాపీలు కొట్టేస్తే యింత బాధ వుండదు. నా ఆలోచన నాకే అసహ్యంవేసింది. ఎలాంటి వాడిని యెలా దిగజారిపోతున్నానో! నిద్ర పట్టదు. ఆలోచనలు రాకమానవు. పరీక్ష గట్టెక్కేటట్లు తోచదు. అక్రమంగా ప్రవర్తించలేను. డబ్బు చిమ్మలేను. ఏవిధంగా నెగ్గుకు రాలేను. చివరకు చావే నయమని పించింది. చచ్చి సాధించేది లేదుగాని, ఒక జీవి తక్కువయినట్టే గా! మంచి, చెడ్డలను విచారించే పరిస్థితి దాటిందో నాలో! అభిమానం అడ్డువచ్చి, తిరిగి ఎవ్వరినీ

అడగ బుద్ధిపుట్టలేదు.

బలహీనుడ నవుతున్నాను. బతకలేక, బతికి చేసేదిలేక చావాలను కొన్నాను. ఈ ఉత్తరంద్వారా నా ఆవేదనను మీకు తెలియజేయాలనే వ్రాసేను.

'మేష్టారూ! మిమ్మల్ని వేలెత్తి చూపటానికి కాదు. మీలాగే డబ్బుతో మూసుకున్న మీ లాంటి హృదయాలను. యిప్పటికైనా తెరిచి, నాలాంటి అభాగ్యులకు చేతనైనంత సాయం చేయమనే నా ప్రార్థన. నాలాంటివారు కోకొల్లలు. వారందరికీ కావలసింది, మీలాంటి పెద్దల సహృదయత, దయార్ద్రత. డబ్బే ప్రధానంకాదు మేష్టారూ! డబ్బుతో రానిది ఆత్మతృప్తి. మంచిపని చేసేనని తలచి దానివల్ల పొందే ఆనందాన్ని మీరు డబ్బుతో కొనలేరు. పైకి మంచివాణ్ణి అని చెప్పకొనడంకాదు మేష్టారూ! ఆ మంచిని సరియైన దోవలో పెట్టి, నలుగురికి ఉపకారం చెయ్యాలి. నేను బ్రతికివున్నట్లయితే మీమీద ద్వేషం పెంచుకునే వాడిని. నామనసును అటువంటి అపవిత్రపు పనికి పూనుకోనీయలేదు.

మేష్టారూ! అందరూ మంచివాళ్లే అనుకునే నాకు, సరియైన వివేకాన్ని కలుగచేసేరు. ఎవ్వరేనా 'ప్రయివేట్ చెప్పరూ' అని అడిగినప్పుడు నేను గుర్తుకు వస్తానులేండి. మిమ్మల్ని అని లాభంలేదు మేష్టారు! అసలు పరిపాలనా విధానమే అలా వుంది. మీ పనులు మీరు సరిగా నిర్వర్తిస్తున్నారా లేదా అని అడిగే వారులేరు? విద్యార్థుల మంచి, చెడ్డలను ఆలోచించేవారు లేరు? అందుకే పిల్లలు దారుణాలు తలపెడుతున్నారు. నీతులు చెప్పే పెద్దలే అన్యాయం అధర్మంగా ప్రవర్తించేటప్పుడు. చిన్నహృదయాలు. వికసించే మనసులు, ఆ దెబ్బలకు తట్టుకోలేక వడిలి, రాలిపోతున్నాయి. కోపం తెచ్చుకోకండి మేష్టారూ! నాలాంటి అభాగ్యులకు తగిన సహాయం చేయమనే నా ప్రార్థన. దానిలోనే మాధవసేవ కూడా వుంది.

ఇదే మేష్టారూ నేను కోరేది!

ఇట్లు
గోపీనాథ్!'

ఉత్తరం పూర్తిగా చదివిన ప్రిన్సిపాల్ గారి కళ్లనెంబడి రెండు కన్నీటి బొట్లు రాలేయి. విద్యార్థులు చేతిరుమాలుతో కళ్లు తుడుచుకున్నారు. మెల్లగా ఏవో శపథాలు చేసుకొన్నారు విద్యార్థులు. ●

# ఒక వారం విపరీతం
## ఫాలాక్షుడు

### దొంగల్లో దొర!

ఈ మధ్య జయప్రకాశ్ నారాయణ్ గారు కొందరు దొంగల్ని బాగు చేసిన సంగతి అందరికీ తెలుసు. అయితే ఆ దొంగల్లో దొరవంటి మధోసింగ్‌ని కాంగ్రెసు శాసన సభ్యుడు వేసిన ప్రశ్న, ఆతని సమాధానాలు ఎందరికి తెలుసు?

'మీరు ఎప్పో విదేశాలు తిరిగారుట, దొంగ అయివుండీ ఇదంతా ఎలాగ సాధించారు?' అన్నది ప్రశ్న.

'మీలాంటివాళ్ల సహాయంతో' అన్నది (మధో సింగ్) సమాధానం.

### విద్యార్థి లేని కళాశాల!

లక్నోకు చెందిన హల్ద్వానీ కాలేజిలో మన్ను కయినా ఒక్క విద్యార్థి కూడా లేడట. ఒక ప్రిన్సిపాలు,




నొ అధ్యాపకుడూ, క్లర్కులూ వగైరా మాత్రం వున్నారట. ఈకాలేజి 1960—61 లో స్థాపించిన నాటిది నడపడం కష్టమై, 1971 లో ప్రభుత్వానికి అంకితమిచ్చేశారట.

### విమానాశ్రయంలో అప్పులవేట!

ఏప్రిల్ 28 వ తారీకు ఒక ప్రయాణికుడు మదరాసు విమానాశ్రయంలో తన విమానం ఎక్కటానికి కాచుకుని ఉండగా అతనికి అప్పు ఇచ్చిన వాళ్లు కొందరు బలవంతంగా బయటికి లాక్కు వెళ్లిపోయారుట! కాని, ఇండియన్ ఎయిర్‌లయిన్స్ వాళ్లు అతన్ని రక్షించారుట.. ఈ గొడవ మూలాన అయిన ఆలస్యం? పది నిముషాలు మాత్రమే....

### పిడుగుపడి ఇద్దరి మరణం

కొట్టాయానికి సమీపంలో వున్న చెంగనచ్చేరి అనే గ్రామంవద్ద ఏప్రియల్ ఇరవై యొకటో తేదీన పిడుగు పాటు వల్ల ఇద్దరు మృతి చెందారట. ఈ ఇద్దరిలో ఒకరు స్త్రీ అట.

### పేపర్లు కష్టంగా ఉన్నందుకు విద్యార్థుల ఆగ్రహం!

హయ్యర్ సెకండరీ స్కూలు పరీక్ష పత్రాలు చాలా కష్టంగా వున్నాయన్న నెపంమీద కలకత్తాలో చాలా స్కూళ్లలో విద్యార్థులు ఆ పరీక్ష పత్రాలను చింపి, పోగులు పెట్టారట— రైళ్లో.

### కాపీ కొట్టేవారికి ప్రత్యేక వసతి!

ఢిల్లీ విశ్వవిద్యాలయానికి చెందిన ఒక కాలేజిలో పరీక్ష హాల్లోకి ప్రవేశిస్తున్న వో విద్యార్థి 'నేను కాపీకొట్టి తీరుతాను. నన్ను కాదని ఎవరనగలరు? అని, ఎవరు మిగల గలరు.' అని కాస్త గట్టిగా వో జనాంతిక పారేసి హాల్లోకి వెళ్ళాడట. ఈలాటి కష్టసుఖాలను భరించలేక, అటువంటి విద్యార్థుల కొరకు 'కాపీగది' అని వో గదిని కేటాయించారట. ఆ రూములో పరీక్షల సమయంలో సభ్యత్వం సంపాదించిన వారిహ నిరాఘాటంగా కాపీలు కొట్టుకో వచ్చుట. వీరిలో విద్యార్థినులు కూడా వున్నారుట— కిమాశ్చర్యం! సమాన హక్కులకోసం ....కదా!




### కలహాన్ని సృష్టించిన కాపీ కాగితాలు

పాట్నాలో వో కాలేజిలో ఇంటర్మీడియట్ పరీక్ష రాస్తున్న విద్యార్థుల మధ్య చిన్న పని స్పర్ధ వచ్చిందిట. కాపీకొట్టడానికోసం తెచ్చుకున్న కాగితాలు ఒకరికొకరు అందించుకోడంలో వచ్చిందట యీ తగాదా. దాంతో వో విద్యార్థి మరో విద్యార్థిన్ని పిస్తలుతో (అరెక్కడిదో!) కాల్చి చంపేశాడట.

### చచ్చి బతికిన స్త్రీ!

జలంధర్ లింక్‌రోడ్డుకు చెందిన లాజ్‌పత్ అనే 20 ఏళ్ళ ఆమె వో ఆసుపత్రికి వచ్చి, అక్కడ విరుచుకు పడిపోయిందట. నాడికొట్టుకోడం మానే యడం వల్ల, రక్తప్రసరణం ఆగిపోవడం వల్ల,




గుండె పని చెయ్యడం మానివేసినందువల్ల ఆమె చని పోయినట్లు డాక్టర్లు కొందరు నిర్ధారణ చేసినా రట. కాని మరి కొందరు డాక్టర్లు అంగీకరించ కోడానికి వీల్లేదని, కష్టపడి ఆమెను వైద్యంచేసి బ్రతికించారట.

### ఉత్తమ చెత్త కళాకారులకి సన్మానం!

సినిమారంగంలో ఆ యేడు ఉండాలో ఉత్తమ కళాకారులను ఎన్నుకుని సన్మానించిన పక్కలో చెత్త కళాకారులను కూడా ఎన్నిక చేసిందట హాలీ వుడ్. హాలీవుడ్ సినిమాలలో పెద్ద చెత్త సినిమాగా 'ఎక్లాక్ వర్క్ ఆరెంజ్' అనే సినిమాకు బహుమతి ఇచ్చారట వారు.

జాన్ నికల్‌సన్ అనే ఆతడు ఉత్తమ చెత్త నటుడు గానూ, నటి కాండిస్ బెర్గర్‌ను ఉత్తమ చెత్త నటిగానూ, ఎడ్వర్డ్ గస్‌ను చెత్త సహాయ నటుడుగాను, లాస్ వుడ్‌ను చెత్త సహాయనటిగాను ఎన్నిక చేశారట— మన తెలుగు సినిమాలలో మాటేమిటి?

## ఆత్మహత్యా ప్రయత్నం చేసిన స్త్రీ అరెస్టు

ఢిల్లీ అర్జున నగర్‌లో ఇందర్‌కౌర్ అనే ఓ 70 ఏళ్ళ స్త్రీ ఆత్మహత్యార్థం న్నైల మత్తం మింగేసిందట. ఆమె స్పృహతప్పి పడిపోయాక, చుట్టుపక్కల వారామెను వినయ్‌నగర్ ఆసుపత్రిలో చేర్చారట పోలీసులు. అంతేగాక, ఆమె మీద ఆత్మహత్యా ప్రయత్న నేరం కూడా మోపారట. పాపురళ్ళి.

## చెత్తకుండీలో పసికందు శవం

17వ తేదీ పాంచుకూన్ సిటీలో ఓ చెత్తకుండీలో అప్పుడే పుట్టిన ఓ పసిపిల్ల శవం దొరికిందట. అప్పనుకదా! పుట్టిన పిల్లను పోషించే శక్తి నీలో వున్నదా? అని ప్రభుత్వం వేలెట్టి చూపి, ప్రశ్నించడం లేదూ?

## పాసింజర్ బండిలో ప్రసవం!

సామర్లకోట నుండి ఏలూరు వెళ్ళడానికి నాగుల పల్లి పాపా రత్నం అనే గర్భిణీ స్త్రీ పాసింజరు బండిలో బయలు దేరిందట. బండి ఏలూరు చేరేలోగానే ఆమెకు ప్రసవ వేదన ప్రారంభమయ్యిందట. భీమడోలు ప్రాంతానికి బండివచ్చే సరికామె పండంటి పిల్లవాణ్ణి కన్నదట.

## పోలీసుని హత్యచేసిన పాత కేడీ!

ఢిల్లీ సహారాగంజ్ నాజ్ సినిమా థియేటరు ముందు బ్లాక్ మార్కెట్టు అమ్మకాలను అరికట్టడానికి 30 ఏళ్ళ నందకిషోర్ అనే పోలీసు కానిస్టేబులును డ్యూటీకి వేశారట. మొన్న 20వ తేదీన జగదీష్ చంద్ర అనే ఓ పాత నేరస్థుడా ప్రదేశంలో తిరగడం చూసి నందకిషోర్ అతన్ని అటకాయిస్తే, అతడు సర్రున కత్తితీసుకుని, ఆ పోలీసును పదిసార్లు తీవ్రంగా పొడిచి పారిపోయాడట. నందకిషోర్ ఆసుపత్రిలో చేర్చాక చనిపోయాడట. ●

అది...ఇది

## మదరాసు ప్రెస్‌క్లబ్ ప్రారంభోత్సవం

ఎన్నో ఒడిదుడుకులెదుర్కొన్నప్పటికీ మనదేశంలోని పత్రికలు తమ పాత్రని సమర్థవంతంగా నిర్వహించాయని, స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు పత్రికలకి ఉన్నప్పుడే ప్రజాస్వామ్యం పటిష్టంగా ఉంటుందని మే 2వ తేదీన స్థానిక న్యూఉడ్‌లాండ్స్ హోటల్‌లో జరిగిన మదరాసు ప్రెస్‌క్లబ్ ప్రారంభోత్సవ సమావేశానికి అధ్యక్షత వహించిన తమిళనాడు గవర్నర్ శ్రీ కె. కె. షా తమ ప్రసంగంలో పేర్కొన్నారు.

ప్రెస్‌క్లబ్ అధ్యక్షులు శ్రీ మురసొలి మారన్ సభికులకి స్వాగతం చెప్తూ పత్రికా రచయితలంతా ఒకచోట కలుసుకొని ఒకరి అభిప్రాయాలు మరొకరు తెలుసుకునేందుకు, విరామ సమయంలో కాలాన్ని సద్వినియోగం చేసుకోడానికి ఈ ప్రెస్‌క్లబ్ తోడ్పడుతుందని అన్నారు.

మదరాసు ప్రెస్ క్లబ్‌కి ప్రారంభోత్సవం చేసిన తమిళనాడు ముఖ్యమంత్రి శ్రీ కరుణానిధి ప్రెస్‌క్లబ్ ఏర్పాటుకు కావలసిన స్థలాన్ని యివ్వడానికి ప్రభుత్వం తరపున తమ అంగీకారాన్ని తెలిపారు.

కార్యదర్శి శ్రీ ఎస్. వాసుదేవన్ ప్రెస్‌క్లబ్ కార్యక్రమాలని వివరిస్తూ నివేదికని చదివారు. సహాయ కార్యదర్శి శ్రీ ఎం. పి. చెరియన్ ప్రముఖుల సందేశాలని చదివి వినిపించారు. కోశాధికారి శ్రీ ఎస్. విశ్వనాథన్ వందన సమర్పణ చేశారు.

(ఎ. వి.) ●

**జి. పి. ఆర్, బరంపురం**

పిల్లలు లేనివాళ్లు ఎందుకు బాధ పడాలి? సంతాన నిరోధం అవలంబించే అవసరం తప్పినందుకు సంతోషించాలిగాని?

పొరపాటు రావుగారూ, పిల్లలెందుకో తెలుసా? ప్రేమలు బలపడ్డానికి. రోజులు గడవడానికి. దబ్బులు ఖర్చవడానికి. ఇల్లు ఆనందంతో నిండడానికి. బట్టలు కరాబు కావడానికి. గతం మరిచి పోడానికి, వర్తమానం ఉత్సాహవంతంగా గడవడానికి. భవిష్యత్తు కోరుకో తగ్గదిగా తోచడానికి..... ఓ పసిపాప ఎంతైనా అవసరం.

**కె. కె. ఆర్, పిఠాపురం**

మంచో చెడో పేరు రాడానికి దగ్గిర దారేది?

ఏ కీర్తికైనా దారి పూలదారి కానేకాదు. కష్ట పడక తప్పదు!

**ఎస్. కె. ఆర్, పర్లాకిమిడి**

విద్యార్థులు రాజకీయాలకి ఎంత దూరంలో ఉండాలి?

విద్యార్థి దశలో రాజకీయ పరిజ్ఞానం సంపాదించు కోవాలి. అప్పుడు, చదువు పూర్తి చేసుకున్నాక— ఉద్యోగం కావలిస్తే ఉద్యోగంలో చేరవచ్చు. లేదా— రాజకీయ రంగంలోకి దిగవచ్చు. విద్యార్థి దశలోనే రంగంలోకి దిగితే—రెండిటికీ చెడ్డ రేవళ్లుగా తయా రయే ప్రమాదం ఉంది.

**కె. ఎస్. ఆర్. బరంపురం**

ప్రగతి అంటే అర్థం ఏమిటి?

ముందడుగు ప్రోగ్రెస్.

**బి. ఎస్. ఎన్, సంతరగచ్చి (ప. బె)**

నేను ఎక్కువ సంతోషం భరించలేను. ఎక్కువ విచారం భరించలేను. కారణం ఏమిటి?

కారణం ఏమిటో తెలియదు గాని. తగినంత విచారం ఉన్నట్టు తగినంత సంతోషం లభ్యం కాద లోకంలో అనిపిస్తుంది.

**వి. ఎస్. ఎన్, ఉన్నవ**

కష్టాల్లో భగవంతుని ఆశ్రయం కోరిన




పురుషుడు సుఖాల్లో తలచనైనా తలచడు. ఎందుచేత?

సుఖాలు పంచుకుందుకు చాలామంది వుంటారు. కంపెనీకి లోటు వుండదు. కాని కష్టాలు పంచు కుఖాదు కెవరుంటారు? ఒక్క భగవంతుడు తప్ప. అందుకే ఆ సమయంలో అతని ఆశ్రయం కోరడం.

**ఎస్. వి. ఆర్, విశాఖపట్నం**

బ్రతుకు పూలబాటే అయినా అను క్షణం ఆ పూలలోని ముళ్లు గుచ్చు కుంటాయి. ఇక యిలాంటి జీవితంలో సుఖమేముంటుంది?

బాధలో కూడా సుఖం వుంటూంటుందని చెప్ప డానికే ముళ్లు. పాని జీవనబాట వెంబడి పరిచేపూలు ముళ్లు లేనివిగా ఏరుకుంటే—!

**ఏ. పి, ఖమ్మం**

మీకు ప్లస్ ఎన్ని? మైనస్ ఎన్ని? సంతానంలో?

ఇంతకీ ఎవరు ప్లస్! ఎవరు మైనస్ సంతా నంలో? అమ్మాయిలని రోజుల్లో మైనస్ అను కునే వాళ్ళున్నారా?

**ఎస్. జె. ఎమ్. పి, తణుకు**

కుటుంబనియంత్రణ విషయంలో భారత ప్రభుత్వం తన వైఖరి మార్చుకోక పోయి నట్టయితే, సహాలుగా నిరాదాలు ప్రారం భించవలసి వస్తుందని జగద్గురు శంకరా చార్యులవారన్నారట. దీన్నేమనాలి?

నోసేవాడికి తెలుస్తుంది బాధ్యతల బరువు. కుటుంబ నియంత్రణ రాజకీయ కుతంత్రం కాదు. మత సౌఖ్యమూ కాదు. ఈ నాటి పరి స్థితులకు అవసరం అయిన ముఖ్యాంశం. చదువు ల్లేవు. ఉద్యోగాల్లేవు. ఇళ్లు లేవు. తిండి లేదు. బట్ట లేదు. బ్రతికే వోపిక లేదు. ఇంకెందుకీ పిల్ల లంటా? తిండి పెట్టలేక పిల్లలను చంపిన తల్లులు, ఆత్మ హత్యలు చేసుకున్న తండ్రులు లేరా? మఠాల్లో మన అధిక సంతానాన్ని పెంచి పోషి స్తారా? తల్లి ఆరోగ్యందృష్ట్యా, పిల్లల భవిష్యత్తు దృష్ట్యా, దేశ భవిష్యత్తు దృష్ట్యా— కుటుంబ నియం త్రణ అవసరం. అదీ ఎవరికి వారు తెలుసుకుని గుర్తించవలసిన— అవసరం.

**ఏ. ఏ, మాచెర్ల**

బ్రహ్మచారికి శత్రువేది?

ఏకాంతం!!

**బి. ఎస్, దుగ్గిగూడెం**

ఆడది ఆదిశక్తి అంటారెందుకు?

జీవకోటికి తుది మొదలూ ఆమె కదా? అందుకు.

**ఏ. వి. ఆర్, ఆర్లగడ్డ**

ఎందుకండీ రూపాయికి విలువ అలా తగ్గిపోయింది?

వస్తువుల విలువ అలా పెరిగిపోబట్టి బ్రదర్!

**ఎస్. కె. ఏ, కొవ్వూరు**

మీరిచ్చే జవాబులు నాకు సంతృప్తి నివ్వనని తెలిసీ ఎందుకు సమాధానం యిస్తారు?

మీకు కష్టంలేదని తెలిసీ మీ శత్రువు లింకా ఎందుకు బ్రతికి ఉన్నారు!

మీకు చాలా గర్వం అని విన్నాను. నిజ మేనా?

సగం.

**పి. వి. జి, అనకాపల్లి**

ఒక మనిషి స్వభావాన్ని పట్టి ఆ మనిషి యింతకు పూర్వం పడినట్ట కష్ట సుఖాలను చెప్పకలమా?

ప్రత్యేకించి యివి అని చెప్పలేక పోవచ్చుగాని తెలుసుకోడం కష్టం కాదు. సరదా అయిన స్వభావం కలవాడు సుఖాలే పడ్డాడని, నిరాశావాది కష్టాలే పడ్డాడనీ కూడా అనలేం. ఎందుకంటే— కష్టాలు పడి లేచిన వ్యక్తి స్వభావం— తేలిక పడి వుండ వచ్చు. నిరాశావాదికి పిరికితనం పట్టుకునే వుండ వచ్చు. అంచేత మనిషి ప్రవర్తనా, స్వభావం పూర్తిగా అతని గతానికి అద్దం పట్టవుగాని కొంచెం కొంచెం తెలియచేస్తూనే ఉంటాయి.

## పెద్దకథ:

# కలలో ఫలించిన

సింగరాజు రామచంద్రమూర్తి

(గత సంచిక తరువాయి)

మా ఊరు చేరాక రెండు రోజులపాటు ఏటూ నిర్ణయించుకోలేక సరోజ వాళ్ళ ఇంటికి వెళ్ళలేదు నేను. చివరికి చూచాయగా హెచ్చరించడం మంచిదనిపించింది. ఆమె ప్రవర్తన నచ్చకపోవడం అటుంచి పెళ్ళిళ్ల గురించి నాకూ కొన్ని అభిప్రాయాలేర్పడుతున్నాప్పయటికే! అందులో మొదటిది ముఖ్యమయినది— ఎన్ని ఆదర్శాలు మాటాడినా ఇలాంటి వివాహాలు సుఖప్రదం కావన్నది!

అందుకే ఒకరోజు వాళ్ల ఇంటికి వెళ్లాను. సరోజ నాన్నగారు వరండాలోనే కూర్చుని ఉన్నారు. "నమస్కారమండి". అంటూ వెళ్లి కుర్చీలో కూర్చున్నాను.

ఆయన ఏమీ మాట్లాడకుండా నావంక చూస్తుండి పోయాడు. అది నాకు చిత్రంగా అనిపించింది. "క్రితం వారం విశాఖ పట్నం వెళ్లివచ్చానండి" అన్నాను.

"అవును తెలుసు!" అన్నారాయన.

"సరోజను కలుసుకునేందుకు ప్రయత్నించాను."

"అదీ తెలుసు".

నేను నీరయిపోయాను— ఆయన ధోరణికి! అయినా ధైర్యంగా "మూడు సార్లు హాస్టలుకి వెళ్లినా కలవలేక పోయాను" అన్నాను.

"ఐసీ!"

కాసేపు, తటపటాయించాను. తరువాతి విషయం ఎలా చెప్పడమా అని "ఎవరో స్నేహితు డొకతనున్నాడు— అతనితో కలిసి తిరుగుతోందిట" అన్నాను మెల్లిగా.

"అలాగా" అన్నారాయన ఏమీ పట్టనట్లుగా.

నాకు విసుగేసింది. వాళ్ల క్షేమంకోరి నేను చెబుతుంటే అలా మాట్లాడటం నచ్చలేదు నాకు. చివరి ప్రయత్నంగా "నేను ముందుగా చెప్పి మరీ వెళ్లినా కలవలేదు నాకు సరోజ" అన్నాను.

"ఎమ్మేచదువుతున్న పిల్ల, పనులుండవూ దానికి?" అన్నారాయన.

లేచి నిలబడ్డాను. "మరి వస్తానండి" అని వచ్చేశాను. గేటుదాటి చాలాదూరం



వచ్చేశాక గాని గుర్తు రాలేదు. నా కళ్ల జోడు వాళ్లింట్లో వదిలి వచ్చేశానని. తిరిగి వెళ్లాను. వరండాలోకి ఎక్కుతుంటే లోపలి నుంచి మాటలు వినబడుతున్నాయి. సరోజ నాన్నగారివి. "నాలుగు రోజు లయిందిలే ఉత్తరం వచ్చి. నీకు చెప్పలేదు. ఎంతయినా ఎమ్మే చదువుతున్న పిల్లకదా వీడి వేధవ్వేషాలకి పడుతుందా? పేగు లెక్కేట్టేసింది వీడిని."

"ఇంతకీ ఏమని రాసిందేమిటండి, అది చెప్పరేం ఖర్మ" అంది సరోజ వాళ్ల అమ్మ.

"ఇలా వచ్చాడు ఫలానావాడు. ఇది వరకటి చనువుతోటి నా దగ్గర అనవసరంగా హద్దుమీరి మాటాడడం మొదలెట్టాడు. వెంటనే చెప్పేశాను. "ఎంతవరకుండాలో అంతవరకే ఉండు మిస్టర్, మర్యాద దక్కదు లేకపోతే" అని. కోపం వచ్చి లేచి వెళ్లిపోయాడు. ఆ కసికొద్దీ లేనిపోనివన్నీ నా మీద చెబుతాడు మీకు అతన్ని చిన్న తనం నుంచి ఎరుగున్నదాన్ని

నేను. నా సంగతి మీకు తెలుసును. కనుక పరవాలేదనుకోండి. అయినా ఎందుకయినా మంచిదని రాస్తున్నాని ఉత్తరం. అతన్ని మాత్రం నిలదీసి అడక్కండి బాపుండదు. ఊరంతా యాగీ చేసినా చేయగల రిటు వంటివాళ్ళు. మనస్సులో పెట్టుకోండి'' అని రాసింది.

ఆసలేం జరుగుతుందో చూద్దామనే నీకు చెప్పకుండా వూరుకున్నాను. సరిగ్గా అది రాసినట్లే వచ్చాడీ రోజు. ఎవరితోనో తిరుగుతోందని చెప్పాడు'' అని నవ్వాడాయన.

''నిజమేమో, అసలతను చెప్పేదేమిటో పూర్తిగా వినకుండా ఆపించేశారు. వింటే పోయినదేముంది?''

''నాన్సెన్స్. ప్రోత్సహించకూడదటువంటి వాళ్ళని.''

నాకు తల తిరిగిపోయింది. ఎంత తెలివి గలది సరోజ. తన గురించి నేను చెప్పచ్చున్న అనుమానంతో ముందు జాగ్రత్త తీసుకుంది. లోపలికి వెళ్ళి ముసలాయన్ని దులిపేద్దామనుకున్నాను. ఒక్క క్షణం అసహ్యం వేసింది. మాట్లాడకుండా తిరి గొచ్చేశాను కళ్ళజోడు తీసుకుని.

ఆ తరువాత రోజుల్లో నా జీవితం లోనూ, నా ఆలోచనలలోనూ చాలా మార్పులొచ్చాయి. ఆ వూరునుంచి బదిలీ కావడంవలన సరోజవాళ్ళ కుటుంబంతో కల సంబంధం పూర్తిగా తెగిపోయింది.

ఒక వయస్సొచ్చాక మనిషిలో పరిణతి వొచ్చి ఉద్రేకాలు తగ్గి చేయబోయే పనులకి మంచి చెడులు బేరీజు వేసుకుని మరీ చేసే శక్తి పెరుగుతుంది. చదువు తాలూకు పరుగుపందెం అయిపోయి ఉద్యోగంలో చేరిన వాడిని కనుక తీరిక, ఆలోచనలకి అవకాశం కలిగాయి.

అప్పుడు నా కనిపించడం మొదలెట్టింది. సరోజ నా పట్ల అలా ప్రవర్తించడమే నాకు మంచి చేసిందని. ఎందుకంటే తనకీ నాకు వయస్సులో తేడా లేదు. భర్త అన్నవాడిని దేముడిలాగా కొలవాలని నేనెప్పుడూ అనను. అయితే అన్నివిధాలా ఆడది ఆధారపడ తగిన వ్యక్తిగా, కుటుంబ పెద్దగా అతనున్నప్పుడే సంసారం బాగా సాగుతుంది.

అదే వూళ్ళో వాళ్ళ ఇంటికి అంత

# కలలే ఫలించిన

దగ్గరగానూ ఉండి ఉంటే, నా స్థితి ఎలా ఉండేదో తెలియదుగాని మార్పు రావడం నా అదృష్టం. ఆ వూరిలో 'నావి' అనుకో తగిన నిధి నిక్షేపాలు ఏవీ లేకపోవడంవలన మొత్తం అమ్మ, నాన్నగార్లతో సహా మకాం మార్చివేశాను. ఆఫీసులో పరీక్షలకి కట్టడంతో కొంతకాలంపాటు జీవితం కళ్ళు తిరిగేంతటి వేగంగా గడిచింది. అదుగో సరిగ్గా ఆ కాలంలోనే విన్నాను సరోజ పెళ్ళి ఆమె వెంట తిరిగిన అతనితోనే జరిగిందని! దానికి ఆమె తలితండ్రులు చాలా అభ్యంతరం పెట్టారనీ, అయితే వాళ్ళనందరినీ కాదని చేసుకుందనీను!

శరవేగంతో పోయే నా జీవితంలో రోడ్డు ప్రక్కన జరిగే సంఘటనలాంటిదే అయింది సరోజ పెళ్ళి. దాన్ని గురించి పట్టించుకుని విచారపడేంత తీరికా, ఓపికా రెండూ లేకపోయాయి నాకు.

పరీక్షలు పాసవడంతో నా జీతం బాగా పెరిగింది. అప్పుడు నా చుట్టూ ఉన్న ప్రపంచం నా కళ్ళకి ఒక రంగులస్వప్నంలా అగపడ సాగింది. ఆ స్వప్నాన్ని కాగితం మీద పెట్టేసరికి నాకు తెలియకుండానే నేను రచయితగా పలుగురికీ తెలిసి పోయాను. నేను రాసిన వాటిని మెచ్చు కుంటూ నాకు దగ్గరయిన వాళ్ళున్నారు. అలా దగ్గరయిన వాళ్ళలో మరీ ముఖ్యుడు రాజేంద్ర. అతనికన్నా దగ్గరగా, నా హృదయానికతి దగ్గరగా వచ్చేసింది అతని చెల్లెలు నర్మద!

రాజేంద్ర చాలా ఖరీదయిన మనిషి కావడం నన్నిబ్బంది పెట్టే మాట వాస్తవమే కాని అతను స్నేహంలో ఆ తేడా నాకు గుర్తు రానివ్వడు.

నర్మదని చూడలేని రోజు నాకు చంద్రుడులేని రాత్రివంటిది. నా కథ ఏదయినా పడితే ముందు నర్మద నోటి వెంట దాని బాగోగులు వినాలిసిందే. అది నర్మద ఆజ్ఞ. నాకు అతి ఇష్టమయిన కార్యక్రమం.

ఆఫీసుకి శలవు కావడాన భోజనం అవగానే రాజేంద్ర ఇంటికి వెళ్ళాను. ఆరోజు ఉదయం నా కథ పడిన పత్రిక రావడాన నర్మద అప్పటికే చదివేసి ఉంటుందని తెలుసు, ఆమె దాన్ని తీవ్రంగా విమర్శి స్తుందనీ తెలుసునాకు. అలాగే జరిగింది కూడా.

''ప్రేమించుకుని చేసుకున్న పెళ్ళిళ్ళు విఫలమవుతాయనా నీ అభిప్రాయం?'' అనడిగింది నర్మద.

రాజేంద్ర నావంక కుతూహలంతో చూస్తున్నాడు.

''ప్రేమ వివాహాలు' అని కాదు నా ఉద్దేశ్యం. మనం ఎంతగా ఒద్దనుకున్నా మిగిలేవి రెండు రకాలు మనుష్యులలో— కాకాహారం తినేవాళ్ళు, మిగిలిన వాళ్ళు. వాళ్ళ మధ్యన వివాహాలు దెబ్బతినే అవ కాశం ఎక్కువ. సాధారణంగా పెద్దవాళ్ళ ఇష్టానికి వ్యతిరేకంగా చేసుకుంటూరా పెళ్ళి. సంసారంలోని మొదటి 'తీపి రోజులు' అయిపోయాక అందరికీ ఎంతగా దూరమయ్యామో గుర్తుకొస్తుంటుంది. ముఖ్యంగా మగవాడికి. ''ఈ అమ్మాయి కోసమా నా వాళ్ళకి నేనింత దూరమయింది'' అన్న ప్రశ్న కలిగి ఆశ్చర్య పోతుంటాడు.

''ఆశ్చర్యం ఎందుకో?'' అడిగింది నర్మద.

''అప్పటికా అమ్మాయి అతనికి అతి సాధారణమయిన ఆడదానిగా అగపడటం మొదలవుతుంది కనుక. మొదటి గ్లామరంతా పోతుంది. అక్కడినుంచి చిన్న చిన్న పోట్లాటలు, పెద్ద పెద్ద దెబ్బలాటలు, విడుపులు, విరక్తులు కొన్ని చోట్ల ఆత్మ హత్యలు!''

నర్మద నవ్వేసింది ''ఎంతయినా రాసిన దానిలోని తప్పుని కప్పిపుచ్చుకోవడంలో నేర్పు లేకపోతే ఈ కథేందుకు రాస్తారు లెండి''.

ఆమె వంకే చూస్తుండిపోయాను. నర్మద నవ్వితే చాలా అందంగా ఉంటుంది.

''అంత దారుణమా చెప్పండి. చదువు కునే రోజుల్లో ప్రేమించింది. అప్పుడు చిన్నతనంలో తనతో చదువుకున్న అతను వస్తే అతనితో మాట్లాడకుండా పంపించేసింది. అతను మళ్ళీ ఇంట్లో తనవారితో నిజం చెప్పేస్తాడన్న భయంతో అతన్ని గురించి లేనిపోనివి తనవాళ్ళకి ఉత్తరం

ఆ చక్కని,
పరిశుభ్రమైన తెల్లదనానికి

# ఓ ఓ బి నీలి

ఓ ఓ బి నీలి నీటిలో అతి సులభంగా, పూర్తిగా కరుగుతుంది. తెల్లటి దుస్తులకి సమమైన మంచులాంటి తెల్లదనాన్నిస్తుంది. మీ చొక్కాలకు, చీరలకు, దుప్పట్లకు మరియు ఇతర బట్టలకు అధికమైన తెల్లదనాన్నివ్వడానికి ఇదే అతి పొదుపైన పద్ధతి. నీలపు మరకలుండవు. పసుపు రంగుగా మారదు.

ఓ ఓ బి నీలి భారతదేశంలోకెల్లా పెద్దదైన, ఆధునికమైన ఫ్యాక్టరీలో పశ్చిమ జర్మనీవారి సహకారంతో తయారుచేయబడుతున్నది.




తయారుచేయువారు:

**అల్ట్రామెరైన్ పిగ్‌మెంట్స్ లిమిటెడ్** అంబత్తూరు, మద్రాసు-53



UPL/6548

రాసింది.

తరువాత ఆ ప్రేమించినవాడినే చేసుకుంది. అంతవరకు బాగానే ఉంది. అక్కడ నుంచి ఆ అమ్మాయి భర్త రాక్షసుడయిపోయి తన ఇబ్బందులన్నిటికీ ఈ అమ్మాయే కారణం అయినట్లు అంత దారుణంగా తిట్టడం, కొట్టడం, ఈవిడ పడటం అసందర్భంగా లేదూ?" అడిగింది నర్మద.

"చెప్పాగా నా అభిప్రాయాలవి. నేను నమ్మిన సిద్ధాంతమది"!

"విసిగిపోయి చివరికి భర్తని వదిలేసి వెళ్లిపోవడమా. ఆమె దేవత అనుకున్న భర్త బాధపడకపోగా . . . దారుణం అండి విశ్వంగారూ!"

"నిజం ఎప్పుడూ దారుణంగానే ఉంటుంది నర్మదా!"

"ఆత్మహత్య చేయించక పోయారూ—మీ చేతిలోని పనేగా!"

"తప్పు. పిరికితనం ప్రోత్సహించకూడదు రాసేదానిలో!"

"వదలటం పిరికి తనం కాదా?"

"కాదు. హీరోయిన్ భర్తని వదిలి వెళ్లిపోయిందని రాశానేగాని ఏమయిందో రాయలేదుగా! చదువుకున్న పిల్ల — ఉద్యోగం చేసుకుంటూ సుఖంగా బ్రతకవచ్చును!"

అంతవరకు మా ఇద్దర్నీ చూస్తున్న రాజేంద్ర "అసలు ప్రేమ విషయంగురించి మీ అభిప్రాయం ఏమిటి గురువుగారూ?" అనడిగాడు.

నాకు తెలుసు తన బాధ్యత తెలిసే అతనా ప్రశ్న అడిగాడని. నర్మదకి నా మీదగల ఇష్టం అతనికి తెలియనిది కాదు.

"ఒక్క రోజు పరిచయాన్ని ప్రేమగా మార్చుకుంటే అది ఆకర్షణ అంటాను నేను. ఇంకొంచెం మొరటుగా చెప్పాలంటే కోరికకి ప్రేమ అన్న రంగు కొట్టడం తప్పంటాను. అలాకాక పరిచయం స్నేహంగానూ, ప్రేమగానూ మారటానికి కొంత కాలం తీసుకుంటే అప్పుడు అర్థం చేసుకునే అవకాశం ఉంటుంది ఇద్దరికీను. ముఖ్యం అయినది వాళ్ల మధ్యన ఎటువంటి అడ్డుగోడలూ ఉండకూడదు. అంటే పెద్దవాళ్ళు వద్దని చెప్పవలసిన

## కలలే ఫలించిన

పరిస్థితులుండరాదు వాళ్ల మధ్య అని నా ఉద్దేశ్యం."

తేలిగ్గా నిట్టూర్చాడు రాజేంద్ర.

నాకూ, రాజేంద్రవాళ్లకి దూరపు బంధుత్వం ఉంది.

నర్మద తలవంచుకుని నవ్వుకుంది.

మర్నాడు ఆఫీసులో పని చేసుకుంటుంటే ఎవరో వచ్చి చెప్పారు, "మీ 'సెల్లిన్ బాబు'' వచ్చాడని. అంటే రాజేంద్రన్నమాట!

బయటకు రాగానే అన్నాడు, "కారెక్కండి గురువుగారూ, పనుంది" అని.

టైము చూసుకున్నాను. "ఇంకా గంట ఉంది. అసలే మా ఆఫీసర్ కొత్తగా వచ్చినవాడు" అన్నాను నవ్వుతూ.

"ఎవడూ శేషగిరిగాడేనా? వాడికి నేనెటువంటి స్నేహితుడినో తెలిసి కూడా ఇంకా ఖంగారు పడతారేమిటి గురువుగారూ! రెండు రోజులపాటు మీ వాడు ఆఫీసుకు రాడని కబురు చెప్పిరానా? గోలీలాడే కాలంనుంచి వాడూ నేనూ క్లాసుమేట్సుమండి బాబూ!" అని ప్యూన్ని కేకేసి "మీ ఆఫీసరుగారితో చెప్పు రాజేంద్రగారు వచ్చి విశ్వంగారిని తీసుకుపోయారు" అని. "ఏం గురువుగారూ, చాలా —కారెక్కనండి మరి" అన్నాడు.

"ఎక్కడికో?"

"మీ కెందుకదీ. ముందు కారెక్కండి."

దారిలో ఇద్దరం మాట్లాడుకోలేదు. సిగరెట్టు వెలిగించుకుని కూర్చున్నాను. నేరుగా తీసుకెళ్లి ఒక బంగళా ముందు ఆపాడు రాజేంద్ర.

దిగి అతని వెంట లోపలికి వెళ్లాను. రెండు ప్రక్కలా క్రోటన్స్, లోపలగా రకరకాల పువ్వులు విరగబూసిన తోట, ఆ తోటలో మధ్యగా రెండు సిమెంటు బల్లలు, వాటికి దగ్గరగా ఫౌంటెన్ లోంచి నీరు చిమ్ముతూ— చిన్నసైజు బృందావన్ గార్డెన్స్‌లా ఉంది.

"అదృష్టవంతులు" అనుకున్నాను. డబ్బున్న మనుష్యుల్ని చూస్తే నా కెప్పుడూ గౌరవం కలుగుతుంది— ఎంత పుణ్యం చేశారోనని!

కాలింగ్ బజర్ నొక్కి కర్టెన్ తొలగించుకుని లోపలికి వెళ్లాడు రాజేంద్ర. లోపలికి వెళ్లిన నాకు ఖరీదయిన హోటలు తాలూకు గదిలాంటి అలంకరణ అగపడింది. విశాలమయిన హాలు, మధ్యన సోఫాలు, వాటికి మధ్యన టీపాయ్, దాని పైన మధ్యగా అందమయిన పూలగుత్తి— "బ్యూటిఫుల్" అనుకున్నాను.

## సోనార్ బాంగ్లా

చిట్టి చిట్టి బాబు లార!
చిన్నారి పాప లారా!
బంగారూ బాంగ్లా దేశ్
గ్లోబులోన చూడ రండి!

బంగాళా ఖాత మదిగో
బంగాళా దేశ మిదిగో
మనదేశం సరిహద్దున
మన నేస్తం అవతరించె!

అదిగదిగో పద్మానది
ఇదిగిదిగో గంగానది
వీరుల రక్తమ్ముతోడ
పావనమగు జలము లొప్పు.

ఏనాడూ సుఖ మెరుగని
ఏడుకోట్ల జనులు వారు
ఎంతటి శక్తుల నైనా
ఎదిరించెడి ఘనులు వారు
మానవతే వారి ఆస్తి
మత మూఢత్వమ్ము నాస్తి

మన నీతిన సిద్ధాంతమె
సమ సమాజ నిర్మాణమె
ప్రజాస్వామ్య సోషలిజమె
ధ్యేయమ్ముగ ఉంచు కొనిరి

మన జాతికి పిత ఎవ్వరు?
బాపూజీ గద అక్కా
బాంగ్లాపిత తెలుసా మరి?
బంగబంధు షేక్ ముజీబు

తలవంచని వీరుడతడు
తిరుగు లేని నేత అతడు
పాక్కసాయి చెరసాలలో
పరితపించె సది వెలుగే

ఈ నూతన సంవత్సరమున
ఏసు ప్రభువు కరుణ వలన
బంధము విడి బాంగ్లా దేశ్
జై సోనార్ బాంగ్లా దేశ్

—పి. ఆర్. నాయుడులు

"కూర్చోండి" అని లోపలికి వెళ్ళాడు రాజేంద్ర.

గోడకి చక్కని పెయింటింగ్స్— ఆ వాతావరణం చూస్తుంటే ఏదో స్వప్న లోకంలో ఉన్నట్లు నిపించింది. రెండు గదులు, ఒక వంటి ఇల్లు ఉండే అద్దె కొంప లకి అలవాటు పడిన మధ్యతరగతి మనిషిని, నేను!

"వీరు మిమ్మల్నెరుగునట— తీసుకు రమ్మంటే వచ్చాం మనం" అన్నాడు రాజేంద్ర మళ్ళీ లోపలికి వస్తూ.

అతని వెనక లోపలికి వచ్చిన మనిషిని చూసి ఆశ్చర్యపడ్డాను.

సరోజ!

లేచి నిలబడ్డాను— ఆమెకి ప్రతి నమస్కారం చేస్తూ. మనిషి బాగా మారింది. పెద్దతనం కొట్టొచ్చినట్లు అగపడుతోంది ముఖంలో. సన్నబడింది.

"చాలా కాలమయింది కలుసుకుని" అంది.

"అవును" అన్నాను.

"కులాసానా? పెళ్లి కాలేదుట— రాజేంద్ర చెప్పారు!"

మాట్లాడలేదు నేను.

"కథలు రాస్తున్నావుట!"

అర్థమయి పోయిందినాకు ఎందుకు ఇలా పిలిపించిందీను. నేను రాసిన కథ ఆమె గురించిందే! అయితే సుఖాంతం మాత్రం కాదు.

"మా వారు చెప్పారు, "మా ఆఫీసులో కథలు రాసే ఆయన నా కింద పని చేస్తున్నారు, పేరు విశ్వం" అని. నువ్వనుకో లేదు.".

నా కర్థం కాలేదామె మాటలు. రాజేంద్ర నా పరిస్థితి గ్రహించి నవ్వుతూ "శేషగిరి ఇల్లు ఇది. ఈవిడ మిసెస్ శేషగిరి!" అన్నాడు.

నవ్వింది సరోజ. గర్వంగా నవ్వుతున్న ట్లనిపించింది అప్పుడు నా కంటికి. ఇందా కటి ఆమె మాటలో "నా కింద పని చేస్తున్నారు" అన్నమాట కూడా గుర్తుకు వచ్చింది.

"మా కారెందుకు . . .? మా కారు లోనే తీసుకు రాకపోయారా కవిగార్ని" అంది రాజేంద్రతో.

దెబ్బ తిన్నాను. తాను ఖరీదయిన మనిషి నని చెబుతోంది.

అంతలో మనిషి సీరియస్ అయి పోయింది. నా వంక చూస్తూ "నువ్వు అన్నిటా చెడునే చూస్తావు. పరాజయాన్నే ఆలోచిస్తావు. చేతనవును కనుక అదే రాస్తావు— ప్రేమ వివాహాలు దెబ్బతింటా యంటూ. నీకు అనుభవం తక్కువ. ఆవేశం ఎక్కువ. ఇప్పుడు చూశావుగా నా జీవితాన్ని. టాక్సీ ఎక్కగలవుగాని కారు కొనగలవా నువ్వు? గదిలో కూర్చుని కసితో వూహించి రాసినట్లే ఉండదు జీవితం" అంది ఆవేశంగా అంతలోనే సర్దుకుని "సారీ, దురుసుగా మాట్లా డాను. నీ కథలో నా జీవితం అంతా పాడయి పోయినట్లు రాస్తే కోపం వచ్చి ఇరిటేట్ అయిపోయాను . . . మా పిల్లల్ని చూస్తావా? ఇద్దరు— ఆడపిల్లలు" అని, "రేఖా, పద్మా" అని పిలిచింది.

ఇద్దరు ముచ్చటయిన పిల్లలు ఫ్రాకు లతో, బాబ్డు హెయిర్‌లతో— ఆరో గ్యానికి అడ్వర్టయిజుమెంట్లలా వచ్చారు— "వాట్ మమ్మీ!" అంటూ.

"ఇద్దరూ కాన్వెంట్లలో చదువు తున్నారు" అని వాళ్ళవంక తిరిగి "అంకుల్" అంది నన్ను చూపించి.

"గుడ్ మార్నింగ్ అంకుల్" అన్నా రిద్దరూ ఒకేసారి.

నాకు ముచ్చటేసింది. "అదృష్టవం తులు మీరు" అన్నాను నవ్వుతూ.

గిరుక్కున వెనక్కి తిరిగి, "కాఫీ పంపిస్తాను" అంటూనే లోపలికి వెళ్లి పోయింది సరోజ.

బిస్కట్లు తిని కాఫీ తాగాక రాజేంద్ర అన్నాడు, "ఇక పదండి గురువుగారూ" అని.

"అదేమిటి, సరోజ— ఆ మిసెస్ ఆవిడతో చెప్పి వెళదాం" అన్నాను.

"ఆవిడేదో పనిలో ఉండి ఉంటుంది లెండి. మీరు సన్నీతోజు సిక్సరుకి తీసుకు వెళ్ళాలి— కథ పడిందిగా మీది!"

"అందులో కొత్తేముంది లెండి."

"పోనీ, నేను తీసుకు వెడతాను లేవండి" అని బయటికి నడిచాడు

అతన్ని అనుసరించక తప్పింది కాదు.



# కలలే ఫలించిన

కారులో నా కొక సిగరెట్టిచ్చి దాన్ని అంటిస్తూ, "మిమ్మల్ని ఇబ్బందిలో పెట్టినట్లున్నాను. ఆవిడ కోరిక— చెప్పకుండా తీసుకు రమ్మనమని" అన్నాడు.

"దాని దేముంది లెండి. కాని నా అంచనాలో నేను విపరీతంగా దెబ్బతినేశాను. ఇంత సుఖంగా ఉంటుందనుకోలేదు! ఆఫ్ కోర్స్, నా అంచనా తప్పడమే నా కిష్టంసుమండీ— సరోజ సుఖంకోరేవాడిని నేను. అయామ్ హాపీ నౌ!"

నవ్వాడు రాజేంద్ర, "మీ అంచనాలు తప్పుతాయి. మీరు రాసినది అక్షరాలా నిజం, ఇక్కడ మారినదే అబద్ధం!"

"ఏమిటి?!"

"నిజంగా. శేషగిరి అనేవాడు సరిగా చూడడు."

"ఎందువల్ల? కోరి చేసుకున్నాడుగా!"

"మళ్లీ మొదటి కొస్తున్నారు. వాళ్ళు వాళ్ళని కాదని చేసుకున్నాడీమెని. అతనికి లేదు కట్నం ఇచ్చేవాళ్ళు. అది వదులుకున్నాడు. కొంతకాలంపాటు గొప్ప ఆదర్శం అనుకున్నాడు. బాగానే ఉంది, తరువాత సమస్య లెదురవడం మొదలయింది. ఇప్పుడీ పిల్లల భవిష్యత్తేమిటి? మన సమాజం అంతగా మారలేదు. వీళ్ళ నెవరు చేసుకుంటారు— అందునా ఆడపిల్లలు!

అతనివైపు వారెవరూ వీళ్ళ ఇంటికి రారు. ఆవిడవైపు వారూ రారు. అతనికి వాళ్ళనుంచి ఉత్తరం ఏదయినా వచ్చిన రోజున అతను తాగుతాడు— మనస్సు పాడయిపోయి. ఆవిడేమయినా అంటే దురుసుగా ప్రవర్తిస్తాడు. ఎవరితో చెప్పకుంటుంది పాపం? ఎవరున్నారు కనుక!"

"మై గాడ్!"

"నిజం మీరు రాశారన్న కసికొద్దీ మిమ్మల్ని రప్పించి తన అంతస్తు చూపించింది మీకు. కాని నిజంగా ఆవిడ సుఖపడటం లేదు!!"

"పూర్ గర్ల్!" అన్నాను.

చీకటిని చీల్చుకుంటూ కారు ముందుకు దూసుకు పోతూనే ఉంది. ●

# కాశీలో ఏం వదిలారు?



కె. రామలక్ష్మి

నేను పుట్టక ముందో, మా అమ్మ పుట్టక ముందో కాశీ వెళ్ళి మా తాత — ఇష్టమైనవన్నీ వదిలేశాట్ట. (పెళ్ళాన్ని కాదనుకొండి!) కాకరకాయకూర, పోపు, ఉప్మా — యిలా ఈ రోజుల్లో ఏవైతే ముఖ్యం అనుకుంటున్నానో అవన్నీ ఆయన ప్రౌఢ వయస్సులో వదిలి వచ్చాట్ట! ఎంత ధైర్యం? ఎలా నిలబెట్టుకుంటూ వచ్చా — యీ నియమం అనుకునేదాన్ని. ఉప్మా పులుసూ వదిలి చప్పిడి తిన్నాకూడా తాతలో పౌరుషం చావలేదు సరికదా పొగరూ పెరిగిందని చెప్పుకునేవారు అందరూ.

ఓసారి శనివారం పూటా మినపరొట్టె ముక్కలు కోసి తింటూ— 'మనం కూడా ఏమైనా వదిలేద్దామా?' అన్నాను. తక్షణం పిల్లలంతా ఏకకంఠంతో 'అమ్మని వదిలెయ్' అంటూ తండ్రికి సలహా యిచ్చారు! సన్నగా ఉండే నా పెద్దకొడుకు— తిండి ఓ పూటకి తగ్గించేస్తా నన్నాడు. వయస్సుకి మించిన లావుతో సతమతమయ్యే నా చిన్నకూతురు చాక్లెట్లు మానేస్తానంటుందేమో అనుకున్నా. మాట్లాడక పూరుకుంది. కొత్త సంవత్సరపు నిర్ణయాలు యిలాగే వుంటాయి — ఎంతో ఉత్సాహంగా నిర్ణయాలు చేస్తాం. బరువు తగ్గించాలని... కోపం తగ్గించుకోవాలని... ఓర్పు పెంచుకోవాలని... ఏమేమిటో చేస్తాం, కాని వీటిలో సంవత్సరాంతం వచ్చేసరికి ఎన్ని మిగులుతాయో మీరే ఊహించవచ్చు.

పిల్లలకి యిలా చిన్న చిన్న స్వార్థత్యాగాలు నేర్పించాలని వుంటుంది నాకు. ఎంతో సేపు చెప్పి— ఏదైనా సరే మనకి అత్యంత ఇష్టమైనదీ, అభిలాషణీయమైనదీ, మోతాదు తగ్గించుకోడంలో, వద్దనుకోవడంలో— మన శక్తి మనకు తెలుస్తుంది. అంతా విని మొండి ఘటాలు 'అమ్మ అన్నిటికీ అడ్డు చెపుతుంది కనుక హాయిగా కాశీ వెళ్ళి అమ్మని వదిలేయ' మంటారు— క్రమశిక్షణ అంటే పడని పిల్లలు!

కాని ఈ కాలంలో కూడా పిల్లల్లో సెల్ఫ్ డినయల్ అన్నదాని ప్రాముఖ్యం ఎంతేనా అవసరం అనుకుంటాను. అన్నీ సమృద్ధిగా సమకూడుతున్నప్పుడు — దేని విలువా పూర్తిగా అర్థంకాదు. అదే నిషిద్ధమైనప్పుడు దాని విలువ తెలుస్తుంది.

ఓ ఏడాదిపాటు ఏదో ఒకటి వదులుకోవడం — చీరలు కొనడమో, అప్పులు చేయడమో, ఏదైనా సరే— ఎంత కష్టమో — ప్రారంభించితేగాని తెలియదు. మా స్నేహితులొకాయన ఒక్క ఆదివారంనాడు ఒకే సిగరెట్టు కాలుస్తానని శపథం పట్టాడు. ఆయన ఆ ఆదివారంకోసం ఎంత భక్తితోనో ఎదురు చూసేవారు. అంతే కాదు. తీరా లేవగానే కాల్చేస్తే అయిపోతుందని — సాధ్యమైనంత లేటుగా సిగరెట్టు తీసేవారు. 'మీకు దీనివల్ల ఏదైనా కనిపించిందా' అని అడగండి. 'లేదనుకో ఆ ఆదివారం ఎప్పుడొస్తుందా అని ఎదురుచూడ్డం — వచ్చాక ఆ సిగరెట్టు కాస్తా అయిపోవడం, మళ్ళీ ఆదివారంకోసం... అయినా ఒక్కటిమాటుకు నిజం. సిగరెట్లు మానకపోయినా— పంతం వస్తే మానేయగలనన్న ధైర్యం వచ్చింది' అంటారు. అది చాలుకదా!

కాశీకివెళ్ళి వదిలేయడం అన్నది ఎందుకు పెట్టారో గాని దాన్లో అర్థం ప్రయోజనం లేకపోలేదు. త్యాగబుద్ధికి నాంది పల్కుతుంది — స్వార్థత్యాగం. ఇంట గెలిచి రచ్చగెలువు మన్నట్టు — మనకి మనం కాదనుకో కల్గితేకదా — ఎదుటివారికోసం ఏదైనా వదులుకోకలం? పెద్దలు మొదలు పెడితేగాని పిల్లలకివి రావు. అంచేత ఆలోచించుకోండి.—కాశీకి వెళ్ళి భార్యాబిడ్డలను కాకుండా ఏదైనా ప్రయోజనం సాధించే దొకటి నిర్ణయించుకోండి — అదే వదిలేయడం!?

## శివస్తోత్రం

గిరీశా, మహేశా
నీవె గదయ్యా,
పొందు కష్టంబుల కెల్లన్
కారణ భూతుండవు,
నిను సేవింతుమయ్యా,
పూజింతుమయ్యా,
మా మొరాలింపవయ్యా,
నిన్నె శరణంటి మయ్యా,
నీవె దిక్కయ్యా
ఓ, గౌరీ వల్లభా!
రక్షింపుమయ్యా, యీ దినంబులను
కంది పప్పు, కరకురాళ్ళ
ప్రహారంబులనుండి
మా కోపిక నశించుచెనయ్యా,
కాలాతీతంబయ్యెనయ్యా
కరుణించవే, హే కపాలధరా!,
రేపు మాపని ఎదురుచూచి
ప్రజలు బోరని గోల పెట్టిరి,
దయతో దర్శనంబిమ్ము మహా
దరిచేర్పవయ్యా నరస్వతీగిరి బారినుండి!

— శాంతి వెంకటేశ్వర్లు




### జరిగిన కథ

ఒక వ్యక్తిమీద అనేక అభిప్రాయాలు వున్నట్టే—ఆ ఆస్పత్రిమీద కూడా అనేకానేక మంచీ—చెడూ అభిప్రాయాలున్నాయి. సూర్యానికి ఆ ఆసుపత్రి అంటే ఒక రకమైన భయం. తీరా అతనుకూడా అందులోనే చేరాల్సి వచ్చింది. ఆ వార్డులో ఇంకా శెట్టిగారు, శ్రీనివాసు వున్నారు. ఆసుపత్రిలో చేరాక సూర్యానికి గతమంతా కళ్ళముందు కదలింది. అతను యవ్వనంలో ప్రవేశించగానే మొట్టమొదటిసారిగా విశాలాక్షి మీదకి మనసు పోయింది. సూర్యం చెల్లెలు గౌరి. ఆమె జ్ఞాపకం రాగానే అతని కళ్ళలో నీళ్ళు నిండాయి. గౌరి భర్త గోవిందరావు మొక్కుబాటిగా ప్రవర్తించేవాడు. అతనితో ఎప్పుడూ గొడవే. గోవిందరావు అకస్మాత్తుగా హాస్పిటల్లో మరణించాడు. ఆఫీసరుగా ప్రమోషన్ రావడం సూర్యం జీవితంలో ఒక పెద్దమలుపు. అంతా అతన్ని ప్రశంసించినవారే. బొంబాయిలో గీతతో పరిచయం అయింది. గీత అతన్ని ఎప్పుడూ ఆడిస్తూ వుండేది. అతన్ని పెళ్ళిచేసుకోవాలని గీతకివున్నా సూర్యం త్రోసి పుచ్చాడు.

## 10

మెహతాలు వెళిపోయేరోజు వచ్చింది.

స్టేషనుకు వెళ్ళాడు. లగేజ్ బుక్కింగ్ చేయించి బ్రేక్ వేన్‌లో వేయించేసరికి కొద్ది క్షణాలు మాత్రం మిగిలాయ్. తొందరగా కంపార్టుమెంటు దగ్గరకు వచ్చాడు. భాభీ లోన పిల్లలతో కూర్చుంది. ఆమె దగ్గర ఆమె చెల్లెళ్ళు, తల్లీతండ్రీ అంతా కూర్చున్నారు. మెహతా ప్లాటుఫారం మీద స్నేహితులతో— మాటాడుతున్నాడు. సూర్యం రెండు బిస్కట్ పాకెట్లు పిల్లలకు అందిచ్చాడు. 'థేంక్యూ అంకుల్' అన్న పిల్లలను అతను బుగ్గ చూపించగానే ఒకరి తరువాత ఒకరు అతనికి ఒకబుగ్గకేకాదు రెండుబుగ్గలకూ ముద్దు పెట్టేసార.

భాభీ ఒకసారి తొంగి సిగ్నల్ వాలటం చూసింది. ముందుకు సూర్యం ముఖం దగ్గరగా వంగి,

'వస్తాను మరదీ. హొటలు భోజనం. ఆరోగ్యం జాగత్త. ఎప్పుడూ ఆలోచిస్తూ కూర్చోక.'

సూర్యం జవాబు చెప్పలేక పోయాడు.

'ఒకప్పుడు హొటల్లో తినలేకపోతే, ఎప్పుడైనా ఒంట్లో చికాకుగా వుంటే... మా అమ్మతో చెప్పాను. వాళ్ళింటికి వెళ్ళు. మరచిపోకేం.'

సూర్యం యీ అభిమానాన్ని మొయ్యలేక కళ్ళల్లో నీరు తెచ్చుకున్నాడు.

'కొన్ని నీకు నచ్చని పనులు చేసుంటానేమో? ఇంకోలా అనుకోక.'

'నివ్వు అలా అనకువదినా! నివ్వు దేవతవి!' రుమాలుతీసి కళ్ళు ఒత్తుకోగానే ఆమెకళ్ళూ నీటిమయమై పోయాయ్. అప్పటికే తన స్వజనం కంపార్టుమెంటు దిగిపోయారు. వాళ్ళవేపు దృష్టి పోనివ్వకుండా వదిన తనతోనే మాటాడటం, తన చెల్లెలు విషయం నసేమిరా యెత్తక పోవటం ఆమె సంస్కారాన్ని చాటి చెప్తున్నాయ్. ఇదే మనసులో నాటుకుని అలా ఖిన్నుడై నిల్చున్నాడు. రైలు కదిలింది. మెహతా 'వస్తాను తమ్ముడూ' అంటూ రైలు యెక్కాడు. రైలు కదులుతుంటే భాభీ యేడుస్తోంది. ఆ కన్నీరు చూడలేక పోయాడు. తనకు స్వంతవదిన లేదు. ఉంటే జన్మజన్మలకు యిలాంటి వదినే కావాలనుకున్నాడు. ప్లాట్‌ఫారం ఖాళీ అయిపోయే వరకూ అలా దూరంగా కనిపిస్తున్న రైలువేపు చూస్తూనే వున్నాడ. తరవాత పెద్ద నిట్టూర్పుతో తలదించుకుని గేటువేపు నడవసాగాడు. తన వెంటనే భాభీ తల్లీ, తండ్రివగైరా వస్తున్నారు. అతను పిల్చాడు. ఆగాడు. గీతవేపు చూడటానికి సూర్యంకు సిగ్గువేసింది. ఆమె ముఖం ప్రక్కగా త్రిప్పినప్పుడు ఒకసారి చూసాడు. పాలిపోయివుంది. ఆమెను ఓదార్చవలెనన్నంత ఆవేశం వచ్చింది. ఏమీ చెయ్యలేక పోయాడు. భాభీతండ్రి నాలుగు కుశల ప్రశ్నలు వేసాడు. వాళ్ళదగ్గరనించి శలవు తీసుకుని యింటికి వెళ్ళలేదు. చీకటి పడ్డవరకూ యెక్కడెక్కడకు తిరిగాడో తనకే గుర్తులేదు. హోటల్లో భోజనం చేసి యింటికి చేరుకునేసరికి రాత్రి పది గంటలైంది

రోజుకురోజూ ఒంటిబతుకు ఆలోచనలకు దారి తీసింది. ఆ ఆలోచనలనించి తప్పించుకోవాలని యిప్పుడు సినిమాలకు, చూసిన వినోదస్థలాలే మళ్ళీ చూస్తూ గడిపేవాడు. ఐనా ఆలోచనలే హెచ్చిపోతున్నాయ్. పొరుగునే వున్న తోటి ఆఫీ

సరే అదొకరకం మనిషి. అంతా డబ్బుతోనే వుంది. తనదగ్గర యీ ఒక్కగదికి పుచ్చుకున్న అద్దె ఆ మొత్తం యింటికి యించుమించు సరిపోతుంది. ఇక ఆవిడకు పాతివ్రత్యంమీద భక్తేకాదు, లోకంలో ఆమె ఒక్కర్తే పతివ్రత అనుకుంటుంది. దంపతుల కిద్దరికీ దైవభక్తి యింతా అంత కాదు. వేకువున నాలుగు గంటలకే తాళాలతో భజన వినిపిస్తుంది. సూర్యంకు తెలివి వచ్చి మరి నిద్రపట్టదు. ఆమె తనతో మాటాడితే యెక్కడ మింగేస్తాడనో సరిగా యెవరవడదు సరికదా సూర్యం మాటాడటానికి ప్రయత్నిస్తే కిట్టినట్టు ముఖనైఖరి చెప్తుంది. ఈమె భాభీలా యిద్దరిపిల్లల తల్లే. ఈ తల్లులకు వాళ్ళు తల్లులమనే గర్వం యెందుకుండదని సూర్యం విసుక్కున్నాడు. ఆలాంటిగర్వం లతకు ఉండబట్టే తనకొక బిడ్డలిలా సంరక్షణ చేసింది. ఆమె యింట్లో వుండేటప్పుడు మనసు హాయిగా వుండేది. తన యింట్లో అమ్మ సంరక్షణలో వున్నట్లుండేవాడు. అందుచేత అతని ఆరోగ్యం బాగుపడింది. తన సొంతయింట్లో వుండే చనువుకన్నా హెచ్చువుండేది. స్వతంత్ర వాయువులను పీల్చేటట్లు హాయిగా గర్వంగా మెసలాడు.

ఇప్పుడు అనన్నీ కరవుకాగానే మనసు మళ్ళీ వికలమౌతోంది. మళ్ళీ తనకు విసుగుబాటు కలుగుతోంది. తన ఖర్చులు కూడా అధికమై పోయాయి. ఇప్పుడు తండ్రికి యిదివరకంత హెచ్చు సంపలేక పోతున్నాడు. తను పంపకపోతే పట్నంలో తన తమ్ముల చదువులు యెలా సాగుతాయ్? చెల్లెళ్ళపెళ్ళికి డబ్బు యెలా కూడబెట్టారు? తిరగటం అంటే ఖర్చు. అందులో బొంబాయిలో కాలు పైకితీస్తే ఖర్చు. కోరికలు పుట్టాయ్. కొనసాగటం అంటే డబ్బు! అందుకే తిరగటం తగ్గించి యింట్లోనే వుంటున్నాడు. ఇంట్లోవుంటే యేమీ తోచదు. ఎంతకని పుస్తకాలు చదువుతాడు.

ఆ మధ్య సినిమాలో గీత దూరంగా కనపడింది. ఇంకోసారి ఫ్లోరా ఫౌంటెన్ దగ్గర బస్సుకోసం క్యూలో నిల్చోగా చూసాడు. ఒకసారి విక్టోరియా గార్డెన్సులో ఆమె వయసు అమ్మాయిల సమూహంతో తిరుగుతుండగా చూసాడు. ఇంకో నాడు ప్రిన్స్ ఆఫ్ వేల్సు మ్యూజియంలో పరీక్షగా ఒక శిల్పాన్ని చూస్తుంటే కొంత దూరంలో తనూ నిల్చొని చూసాడు. ఆమెతో మాటాడాలన్నా మాటాడలేక పోయాడు. దగ్గరగా చేరాలనుకున్నా చేరలేకపోయాడు. ఒంటరితనం సహించరానిదై పోయింది. జీవితంలో యేదో లోటు తెలుసుకోలేని వెలితి—నిత్యం తనను వేధించుకతింటోంది.

ఆ మధ్య ఒకసారి కడుపులో నొప్పి మంచి రాత్రిమీద వచ్చింది. ఎలానో ఓర్చుకోగలిగాడు. రెండురకాల మందులు మరుసటిరోజు కొని వుంచుకున్నాడు. ఆరు నెలల్లో హోటలు భోజనం అంటే రోసు రాసాగింది. అన్నం సహించటంలేదు. శరీరం సరియైన పోషణలేక మనిషి చిక్కిపో



గాలి: తనకోసం ప్రత్యేకంగా మంచి మర్యాల మానేతో భాభీలా యెవరు వండి పెడ్తారు? వెళ్లిన దగ్గరనించి భాభీ ఒక వుత్తరమైనా రాయలేదుగానీ మెహతా రాసిన మూడు ఉత్తరాల్లోనూ మీభాభీ నీ ఆరోగ్యం గురించి రాయమందని రాసాడు. ఆమెకు తన ఆరోగ్యం సంగతి బాగా తెలుసు. ఐనా తెగించి చెల్లెళను చేసుకోమని చెప్పగలిగింది.

సూర్యం బొంబాయివచ్చి రెండేళ్లు గడిచాయ్. రోజులు భారంగా దిగులుగా తిరిగిపోతున్నాయ్. తనకు సంతోషం యిచ్చింది ఆఫీసులో పనే! అది మాత్రం నమ్మకం, బాధ్యతగా చేసుకుంటున్నాడు. తనపై ఆఫీసరు ఒక వరవడి దిద్దించాడు. ఆ వొరవడిలో పోతూ తన ధర్మాన్ని నగర్వంతో నిర్వర్తిస్తున్నాడు. పదుగురూ అతని న్యాయాన్ని, శీలాన్ని శ్లాఘిస్తున్నారు. తన పాత బట్టను యేనాడో వదిలేసాడు. ఈ క్రొత్త దుస్తులకు తగినవాడని నిరూపించుకున్నాడు. పై అధికారులనించి దిగువనువున్నవారిలో తనంటే ఒకవిధమైన గౌరవాన్ని అభిమానాన్ని సంపాదించుకోగలిగాడు.

ఈ పొగడ్తను తెచ్చింది తన నిజాయితీ. తన యిష్టాయిష్టాలు యెదుటివాళ్ల నెత్తిన రుద్దేకండా యెదుటివాళ్లు చెప్పింది వినే ఓపిక, అందులో నిజానిజాలు ఆలోచించే ఓర్పు తనకు అలవడింది. తనపై యెదుటివాళ్లిచ్చే మర్యాద కోరి తెచ్చుకోలేదు, దానంతట అదే వాళ్ల హృదయాలనించి రాసాగింది. అతని ఆరోగ్యం రానురాను పాడవుతున్నా తను సంపాదించుకున్న కీర్తి తనను యింకా అక్కడ వుండాలన్న ఆశను వుంచింది. మూడేళ్లు దగ్గరపడ్తున్నాయనగానే సర్కారు ఒకసారి పనిమీదవచ్చి సూర్యంను చూసాడు. తనేకోరి అడిగి అన్ని విషయాలు తెలుసుకున్నాడు.

'మళ్లీ నీకు ఆ వూరే బదలీ చేస్తాను. నీ తల్లిదండ్రులు దగ్గరగా వుంటారు కాబట్టి నివ్వు వేగంగా కోలుకోగల అవకాశం వుంటుందన్నాడు.

అలానే బదిలీమీద యెక్కడైతే గుమస్తాగా వుండేవాడో అక్కడకే ఆఫీసరుగా వచ్చాడు. ఇదివరకు యే గుమస్తాలలో ఒకడయి మెసలాడో వాళ్ళకు ఆజ్ఞలివ్వాలి. ఏ హూవరేంటెండెంటు దగ్గర ఆజ్ఞలు

# నాలుగు మంచాలు

అందుకున్నాడో వాడిని తను ఆజ్ఞాపించాలి. ఐనా యీ వాతావరణానికి తన మంచితో ప్రేమతో అలవాటుపడిపోతానని అనుకున్నాడు. తిరిగి వచ్చాక తన ఆఫీసు దగ్గరలోనే క్వార్టర్సు యిచ్చారు. కొద్దిగా ఒంట్లో చికాకుగా వుంటే డాక్టరు యింటికి వచ్చి చూస్తున్నాడు. ఇదివరకటి జీవితానికి యిప్పటి జీవితానికి యెంత తేడా? ఈ డాక్టరు యింటికొచ్చే అవకాశం యిదివరకు వుంటే తన బావను పోగొట్టుకొనేవాడు కాదేమో? పూలను పుష్పిస్తున్న చెట్టులా వున్న గౌరి ఒక్కసారి మోరుడు కాకపోయేదేమో? హోదా, డబ్బు, చెయ్యలేనిదేముంది? ఈ హోదా, డబ్బు, తనకు చెయ్యనిది కూడా వుందనిపించింది. తన అజీర్ణవ్యాధి బాగా ముదిరినట్లుంది. మందులుతిని విసిగిపోయాడు. ఏ ఆసుపత్రికి తను యెప్పుడూ వెళ్లనని భీష్మించుకున్నాడో అదే ఆసుపత్రిలోనే తను యిప్పుడు చేరవలసి వచ్చింది.

*　　*　　*

ఆ రాత్రి ఆసుపత్రిలో నిద్రపోకండా పిరికివల్ల మనసు మళ్లించడానికి యీ గడచిన జీవితం అంతా నెమరువేసుకున్నాడు. ఒక సినిమాలో ఒక భాగం చూసినట్లుంది. ముందుకు యేం జరుగుతుందోనన్న ఆతృతతోనే నిద్దర ముంచుకొచ్చింది. నిద్దరనించి లేచేసరికి బాగా తెల్లారింది. అప్పటికే శ్రీనివాస్ సిగరెట్ వెలిగిస్తూ కూర్చున్నాడు.

సూర్యం లేవగానే మెల్లగా దగ్గరగా వస్తూ 'ఏమండీ—ఏంటో తియ్యని కలలు గంటూ నిద్దరపోయుంటారు. లేకపోతే యింత ఆలస్యంగా యెందుకు లేస్తారు?'

'పాడు కలలు రాకూడదా?'

'మీకూ నాకూ రావు. వచ్చినా అవి మంచి కలలుగా మనసు మార్చేస్తుంది. శెట్టిగారికి మంచి కలలే పాడు కలలు అనిపిస్తాయ్. ఏమండీ శెట్టిగారూ అంతేనా?'

శ్రీనివాస్ మాటలకు శెట్టిగారు ఒకసారి తల ఆడించారు. ప్రక్కనేవున్న ఖాళీ మంచం సూర్యంను మళ్ళీ ఆలోచనలో దింపింది. ఆ మంచం గోవిందరావు పోయిన రోజున యిలానే కనిపించింది. ఇంతలో నిన్నటి నర్సే మళ్ళీ ప్రత్యక్షమైంది.

'రొంప యెలా వుందండీ?'

'కాస్త పొడుం యివ్వండి.

'బాగా, మరిగారే! సుఖపడటం మీ చేతుల్లో వుంటే చేతకానివారనిపించుకోనటం యేం బాగులేదు.'

'మీ లెక్చర్లు దేవేంద్రసభలో వేదబుస్తుల సమక్షాన దంచండి.'

'అప్పుడే నన్ను స్వర్గానికి పంపించేస్తారా?'

శ్రీనివాస్ యీ ప్రశ్నతో సూర్యంతో పాటు ఆమె తడబడిపోతూ 'అది కాదండీ. మీ లెక్చర్లు మాకు అర్థం కావు.'

'మీలాంటి వాళ్లెందరో నన్ను అర్థం చేసుకోలేదు.'

'మీ భార్య కూడానా?'

శ్రీనివాస్ నవ్వి మాటలు మార్చడానికి కామోసు 'మీకో కొన్ని యక్ష ప్రశ్నలు వేస్తాను. చెప్తారా?'

'వెయ్యండి.'

'శెట్టిగారు మీరు కూడా సమాధానం యివ్వాలి.'

శ్రీనివాస్: దైవికమైన చుట్టమెవ్వరు?
లాభాల్లో గొప్పదేది?
సుఖాల్లో గొప్పదేది?
ఏవడు చచ్చినవాడితో సమానం?

ఈ ప్రశ్నలు ఒకటి తరవాత ఒకటివేసి సమాధానాలు తనే చెప్పసాగాడు.

శ్రీని: దైవికమైనచుట్టం—ప్రేయసి
లాభాల్లో గొప్పది—ఆమె చూపు
సుఖాల్లో గొప్పది—సంసార సుఖం
ఏవడు చచ్చిన వాడితో సమానం—
ఇవేవీ లేనివాడు.

సూర్యం నవ్వి 'మీ స్వంత కూర్పు బాగుంది. గానీ—ఈ యక్ష ప్రశ్నలకు ధర్మరాజు యేం సమాధానం చెప్పాడో చెప్పండి.'

'జ్ఞాపకం లేదండి.'

'అయితే వినండి. దైవికమైన చుట్టం—భార్య, లాభాల్లో గొప్పది — ఆరోగ్యం, సుఖాల్లో గొప్పది—సంతోషం, దరిద్రుడు చచ్చినవాడితో సమానం.'

శెట్టిగారు లేచి ముందుకు వస్తూ 'ధర్మరాజు గొప్పగా చెప్పాడండి. భార్య, ఆరోగ్యం, సంతోషం, డబ్బు లేకపోతే యేం జీవితం అండీ? చింతతో కూలిపోవలసిందే!'

'ఆలోచించండి. మనలో యీ నాలుగులో యెవరికి యేమిలేవో?' శ్రీనివాస్

# బినాకా® వ్యానిషింగ్ క్రీమ్

బినాకా ప్రవేశపెడుతోంది
సహజ సౌందర్యదాయకమైన,
ఆడంబరరహితమైన సౌందర్య సాధనం

CIBA

మీ ముఖము పైనను, మెడ పైనను, ముఖ్యముగా [illegible] ఎక్కువగా ఉన్న భాగాల పైనను, దీనిని మెల్ల మెల్లగా రుద్దండి. రాసుకున్న జాడే లేకుండా అది మాయమైపోతుంది. మీ ముఖములోని [illegible] నీటి బిందువులను తనతో పాటే [illegible] ఉంచుతుంది. మీ ముఖమును నున్నగా, [illegible] లేకుండా స్వభావ సిద్ధంగా ఉంచుతుంది. మీ ముఖము పై రోజంతా ఉన్నా తేలికగా హాయిగా ఉంటుంది. మీ స్కిన్ ఎండి పోకుండా [illegible] ఏర్పడకుండా చేస్తుంది. మీ ముఖముపై తిరిగి [illegible] మరకలు కలిగించకుండా చేస్తుంది. మీ ముఖానికి ఇంత మేలు చేస్తుంది. కాని తాను మాత్రం బయటకు కనిపించదు.

ఇదే ఆడంబరరహితమైన మేకప్ యొక్క ప్రత్యేకత, స్వాభావిక [illegible] యొక్క సౌందర్యత



## బినాకా® వ్యానిషింగ్ క్రీమ్

mcm/cv/16a tel

అంగుకున్నాడేమో!

సూర్యం ఆలోచించుకున్నాడు. మొదటి మూడూ తనకు లేవు. ఆ మూడూ లేకపోతే నాలుగోది వున్నా సుఖంలేదు. అతనికి సంతోషం రావాలంటే డబ్బు, ఒక్కటే కాదు. భార్యవుండాలి, ఆమె శ్రద్ధ తీసుకుని తన ఆరోగ్యం సరిచేస్తుంది.

'పొదుం పీల్చండి' అన్నాడు శ్రీనివాస్.

'అమ్మో-మీముందర పీలిస్తే తుమ్ము లొస్తాయ్.'

'నాకు తెలిసింది మీరెక్కడపీలుస్తారో?'

'ఎక్కడండీ ?'

'దేవేంద్రసభలో రంభా, వూర్వసుల మధ్య'

'వాళ్లలో నన్ను చేర్చారు-నాకు నాట్యం చాతకాదు సార్.'

'నేను నమ్మను'

'నిజంగా రాదు.'

'నిన్న నాట్యం చేసారు.'

'ఎక్కడండీ !'

'మా యెదరగా తుమ్ముల మేడ్లేం వాగుతుంటే తమరు తైతక్కలాడలేదూ?'

'మీతో మాటాడలేం బాబూ-ఎన్నెన్నో అర్థాలు కల్పిస్తారు'

'ఏదో సినీమాలో ఒక ప్రేమికుడన్నట్టు అన్నారు.'

'ఏమన్నాడు ?'

'ఆడవాళ్ళ మాటలకు అర్థాలే వేరులే అని'

'ఏమైనా మీరు నన్ను గెలవలేరుగా.'

'నేను గెలవకపోయినా — నా పొదుం గెలిచింది.'

'ఎలా ?'

'మీ కాళ్ళు యిదివరకు గాలిలో వుండేవి. ఇప్పుడు భూమ్మీద వున్నయ్'

'చూడండి' అంటూ సూర్యాన్ని మధ్యను పెట్టి 'నేను యిన్నాళ్ళనాళ్ళకు వచ్చి వారంరోజులైనా కాలేదు. అందులో నా జీవితంలో యిలాంటి మనిషిని యిదివరకు చూడలేదు. ముక్కూ ముఖం యెరగని మనిషితో సరదాగా యెలా మాటాడుతూ కూర్చోమంటారు? అలా మాటాడకపోతే కాళ్ళు గాలిలో తేలిపోతాయా ? మీరే చెప్పండి ?'

'లేదండి. మీరు చాలా మంచివారు' అన్నాడు సూర్యం ,

'ఏమండీ మీరు వకాల్తా తీసుకున్నారా?' శ్రీనివాస్ అందుకున్నాడు.

'నాకు వకాల్తా యెందుకూ ? మీ విషయంలో యెవరో తీసుకోవాలి. చూడండి. మీరు యీయన సిగరెట్ కాల్చకుండా చూడాలి.'

'డాక్టరు కాల్చవద్దన్నారా ?'

'అవును. తను కాల్చకూడదు. మీతో మాటాడుతూ కూర్చుంటే యెలా ?' అంటూ వెళిపోయింది.

'ఏమండీ...ఆ సిగరెట్ అలా పారెయ్యండి.'

'దీన్ని...ఈ సిగరెట్‌ని... ఈ సర్వరోగ నివారిణిని-సంతోషాన్ని తృప్తినీ యిచ్చే యీ దేవతని - పారేయంటారా ?'

'దేవతకాదు — దెయ్యం.' సర్వరోగాలను తెస్తుంది.'

'మీకు అలవాటుంటే దీని విలువ తెలిసేది'

'ముందు పారేస్తారా లేదా?'

శ్రీనివాస్ పారేసి ఒకసారి సూర్యంవేపు చూసాడు. 'నన్ను యిలా యిదివరకు యెవరూ ఆజ్ఞాపించలేదండీ, అధవా ఆజ్ఞాపించినా నేను వినలేదు. నాకు నచ్చినది, తోచినదిచేసి యెందరికో దూరమయ్యాను.'

'నేను నమ్మను.'

'నిజం. ఏడవవలసిన సమయాల్లో కూడా నాకు నచ్చినది కాబట్టి నవ్వాను.'

'ఏ ఆడదీ యెప్పుడూ ఆజ్ఞాపించలేదా?'

శ్రీనివాస్ చిరునవ్వుతో

'మీరు ఆడవాళ్ల ఆజ్ఞలను శిరసా వహించినట్లున్నారు.'

సూర్యం బదులుచెప్పక పోవటంతో శ్రీనివాస్:

'ఎందుకు యీ లోకాన వుదయించామో చెప్పండి ?'

'ఏదో సాధించడానికి'

'కాదు. సుఖపడాలనే కాంక్షతో'

'సుఖపడ్తే సాధించలేం'

'నేనన్న సుఖం యేదో సాధించాకకూడా వస్తుంది. ఆ సుఖం యెలా వస్తుంది ?'

'లోభానికి దూరంగా వుంటే మనిషి సుఖపడ్తాడని పంచమవేదం చెప్పింది'

'అసలు లోభంవలనే మనిషి పుడ్తాడు. దానితోనే పెరుగుతాడు. అలాంటిది దాన్ని దూరమైతే అడవిలోని క్రూర మృగాన్ని బోనులో పెట్టినట్లు అవుతుంది. లోభం, కామం, మోహం వగైరా అన్నీ మనిషికి పరిసరాలవంటివి. ఈ పరిసరాల్లో సుఖంగా నివసించాలి. ఆ సుఖం యెలా వస్తుంది ?'

'మీరే చెప్పండి ?'

'ప్రాపంచిక సుఖాలు అనుభవిస్తూ ఆనందించటం వలన—'

'అబ్బే...అవి శాశ్వతం కావు'

'పూర్తి చెయ్యనివ్వండి. మీరు కష్టాల్లో సుఖాన్ని, దుఃఖంలో సంతోషాన్ని, ఆమాట కొస్తే నరకంలో స్వర్గాన్ని, చీకటిలో వెలుగును యెప్పుడు వూహించుకో గలుగుతారు ?'

'మనసులో ఆశను మొలిపించేటప్పుడు'

'ఆ ఆశను యెలా మొలిపించుకో గలరు ?'

'ధైర్యంవలన'

'ఆ ధైర్యం యెలా వస్తుంది ?'

'లోభం కాల్చుకోవటంవలన.'

'కాదు. లోభాన్ని కాల్చేసారంటే మనస్సునే కాల్చేసారన్న మాట. లోభం ప్రతి రూపమే మనసు. ఈ మనసు యేం సాధించాలన్నా లోభం వుండాలి. లోభంతోనే మనసు కోరికలు కోరుతుంది సుఖదుఃఖాలు అనుభవిస్తుంది. ఇలా అనుభవించగలగటం వలనే మనిషి ఆలోచిస్తున్నాడు, అర్థం చేసుకుంటున్నాడు—గమ్యం తెలుసుకోడానికి ప్రయత్నిస్తూ పురోగమిస్తున్నాడు.'

'ఇలా స్వంతం అనుకుంటే ఘనకార్యాలు చెయ్యలేదు.'

'అలా అనుకోవటంవలనే ఆశ వుత్పన్న మౌతుంది. ఆశ అనే ద్రాక్షపళ్ళ గుత్తు లేనిది అందుకోవటమనే ప్రసక్తే రాదు. అందువేత మనిషికి మూలం లోభం వుండాలి. ఆ లోభం ఒక కొవ్వులాంటిది. ఆ కొవ్వును వేడిచేసి మధ్యను వత్తి పెట్టి కొవ్వొత్తి తయారు చెయ్యాలి. అలా చెయ్యటానికి ధైర్యం అనే శక్తి కావాలి. ఎప్పుడైతే కొవ్వొత్తి చేసారో అది యీనాడు కాకపోతే రేపైనా వెల్గుతుంది. ఆ వొత్తి వెలుగుతుంటే లోభం దానంతట అదే కరిగి పోతుంది.'

'నేనన్నదే నిజం అని ఒప్పుకుంటు న్నారుగా, లోభంకు దూరంగా వుండాలని.'

'ఎప్పుడు? మీకు ఒత్తి వెలిగించుకోగల స్తోమత వచ్చేటప్పుడు, కొవ్వు కొవ్వలా వుండేటప్పుడు కాదు. లోభంకి ఒక్కసారిగా దూరమైనా కష్టమే. రాను రాను కొవ్వు యెలా కరుగుతుందో లోభం రాను రాను తగ్గాలి గానీ ఒక్కసారి లోభం పోతే మనిషే లేడు.'

సంభాషణలు యింతటితో డాక్టరు రావటంవలన ఆగిపోయినా సూర్యం మనసులో తర్జన భర్జనలు చేసుకుంటున్నాడు. ఇద్దరి అభిప్రాయాలు యీ విషయంలో వేరు వేరుగా వున్నయ్. లోభానికి ఒక్కసారి దూరమైతేగానీ మోక్షానికి వీల్లేదని తను అనుకుంటే లోభంతో జీవిస్తూ మోక్ష మార్గంగుండా పోవాలని శ్రీనివాస్ వాదన. అతను లోభానికి ఒక శక్తిని ప్రసాదించి మిత్రునిగా చూస్తే, దానిని ఒక బరువుగా చూసి శత్రువుగా సూర్యం చూస్తున్నాడు. మనసులో యీ కొద్ది నిముషాల వాదనలు ఆలోచనల పుట్టలను సృష్టించాయి.

శ్రీనివాస్ యెక్స్‌రే డిపార్టుమెంటుకు వెళ్లాలని అతని డాక్టరు చెప్పాడు. నీరసంగా వుండటంవలన చక్రాల కుర్చీ మీద తీసుకవెళ్ళమన్నాడు. పది గంటలకు వార్డు బోయ్ తీసుకవెళ్తుంటే –

'మీకు తోడు వచ్చేదా?' అన్నాడు సూర్యం.

'మీ డాక్టరు రాడూ?'

'రేపటినించే నాకు టెస్టులు మొదలు పెట్టారు. వస్తాను.'

'మీ యిష్టం.'

ఇద్దరు యెక్స్‌రే డిపార్టుమెంటుకు వెళ్లేసరికి అక్కడ అప్పడే మనుషులు నిండిపోయి వున్నారు. చాల ఆలస్యం అవుతుంది సూర్యం యిలా ఆలస్యం అవుతుందని వూహించే ఫ్లాస్కుతో కాఫీ తీసుకవచ్చాడు. ఇద్దరూ కొంత దూరంలో ఒక బెంచీ మీద కూర్చున్నారు. శ్రీనివాస్ కొద్దిగా కాఫీ త్రాగాక—

'దేముడు యెంత దొడ్డవాడండీ?'

'ఏం?'

'అన్నీ తమాషా పనులు చేస్తాడు. సంతోషానికి యెన్నెన్ని సృష్టించాడు. విషమే తీసుకోండి. అది చంపుతుంది — ప్రాణం నిలుపుతుంది. ఈ కాఫీ కొందరికి విషం —నా కడుపులో పడగానే మాటలెలా వస్తున్నాయో?'

'మీరు దేముడి పేరు యెత్తుతున్నారు: దేముడున్నాడని నమ్ముతారా?'

'ఏం అలా అడిగారు?'

'దేముడు లేడని — మనిషే అన్నిటికీ ముఖ్యుడని నమ్మితే గానీ ధైర్యం రాదని కొందరంటారు.'

'ఏదో నమ్మకం వుంటే గానీ ధైర్యం రాదని ఒప్పుకున్నారు కదా! ఒకడికి సోషలిజం మీద నమ్మకం ధైర్యాన్నిస్తే నాకు దేవుని మీద నమ్మకం తెస్తుంది.'

సూర్యం మళ్ళీ ఆలోచనలో పడ్డాడు. గోవిందరావు చివరి గడియలు జ్ఞాపకానికి వచ్చాయ్. ఏంటో యీ అజ్ఞాతశక్తి దేవుడు—వద్దన్నా వెంటనుండే నీడలా హృదయంలో పొన్ను మీద పవ్వళిస్తుంటాడు. అతన్ని మేల్కొలిపితేనే కామోసు అతని ముఖంపై చిరునగవు వెలుగుంది. ఆ నగవే మనిషికి ధైర్యం తెస్తుంది. ఉదయంనించి యిద్దరూ వేదాంతంలోనే దిగారు. శ్రీనివాస్ జీవితాన్ని నవ్వుతూ కులాసాగా గడిపే మనిషే అని తొలిరోజు పరిచయంతో అనుకున్నాడు. కానీ మరుచటిరోజు అతనితో మాటాడగానే వచ్చిన అభిప్రాయాలు జీవితంలో అనుభవంవలన వచ్చినవిగా అనిపించినయ్. అతని జీవితం అడిగితే గానీ చెప్పడని కాస్సేపటి మౌనాన్ని వదలి—

'నిన్న మిమ్మల్ని చూడడానికి యెవరూ రాలేదు?'

'నాకెవరున్నారని?'

'మీ భార్య – పిల్లలు.'

'మా ఆవిడ చాలా నీరసంగా వుంది. నిన్న బహుశః జ్వరం వచ్చి వుంటుంది. నీరసంగా వుండటంవలన రాలేదేమో? పిల్లలా? ఇంకా లేరు.'

'పెళ్ళయి యెన్నేళ్ళయింది?'

'నాలుగేళ్లు దాటింది.'

సూర్యం మరి కొద్దిగా కాఫీ యిచ్చాడు. శ్రీనివాస్ కాఫీ త్రాగాక చిన్న నవ్వుతో—

'మీకు నా గురించి తెలుసుకోవాలని వుండటం సహజం. నా జీవితం చెప్తాను. మీ దగ్గరనించి కనికరం సంపాదించటానికి మాత్రం కాదు.'

'మీకు నీరసంగా లేకపోతే చెప్పండి.'

'నీరసం అదే పోతుంది. నాకెవరూ లేరన్నాను. నిజంగా దగ్గర వాళ్లెవరూ లేరు. ఇప్పుడు నేనేమైనా అయిపోతే నా భార్యను చూసేవాళ్ళు కూడా యెవరూ లేరు.'

'మీరెందుకలా అనుకోవాలి?'

'అయిపోతానని కాదు. మాటవరసకు అలా అన్నాను. మా అమ్మను ఫోటోలో చూసి యిలా వుండేది అనుకోవటమే గానీ నాకు తెలీదు. నా చిన్ననాటే పోయింది. నాన్నకు దైవభక్తి హెచ్చు. ఎప్పుడూ యాత్రలు చేసుకునేవాడు నే నొక్కడినే బిడ్డను. నేను ఐదోఫారం చదువుతుండగా తనొక్కడే యాత్రలకు వెళాడు. నేనూ



వెళ్ళేవాడినే, పరీక్షలు ముందుకున్నాయని వెళ్ళలేదు. ఇల్లంతా అప్పచెప్పి వెళ్ళాడు. ఎన్నెన్నో బుద్ధులు మళ్ళీ యెప్పుడూ తిరిగి రానివాడిలా చెప్తుంటే నాకే విసుగువేసింది. అలానే మా నాన్న మరి తిరిగి రాలేదు. గోదావరిలో బోటు మీద భద్రాచలం వెళ్తుంటే గాలి వానలో చిక్కుకున్న బోటు తిరగబడిపోయింది. దానితోపాటు మా నాన్న మాయమైపోయాడు. ఆ వార్త నాకు తెలియగానే ఒక్కసారి బేజారెత్తిపోయాను. ఇరుగు పొరుగు వాళ్ళు ఓదార్చారు. దూరపు బంధువులు నేను యెక్కడ దగ్గరై బరువైపోతానోనని దూర దూరంగానే వున్నారు.

# నాలుగుమంచాలు

ఏకాకిని నేను. మా నాన్న పోయాడన్న వార్త విన్న మూడు రోజులవరకూ యేదో సమయాన యేడుస్తూనే వున్నాను. మా నాన్న నన్ను తప్ప యింకేమీ మిగల్చలేదు. ఈ బ్రతుకెందుకని ఒక రోజు రాత్రి సముద్రంలో పడిపోదామని వెళ్ళాను. ఆ యిసుకలో మసక వెన్నెల్లో యెవడో పడివున్నాడు. చచ్చినవాడిలా వున్నాడు. వాడ్ని చూడగానే నా చావు మరచిపోయాను. వాడిపై కనికారంతో నిండిపోయాను. పాపం! ఏ తల్లి కన్నదో—తండ్రెవడో? అడుక్కుని బ్రతికే యీ అనాధునికి భూమాతే తల్లి—యీ గాలి తండ్రి—ఈయన దేహం చాలిస్తే దహనక్రియలుచేసే వాళ్ళైనా వుండరే? వీడికంటే నేను నయం కాదా అన్న ఆలోచన కలిగింది. నయమని నిర్ధారించుకున్నాక—యిలాంటి వీడే యింత సముద్రాన్ని యెదరగా పెట్టుకుని ఆత్మహత్య చేసుకోపోతే తనెందుకు యింత దూరం యీ పనికి రావాలని నా మీద నాకే జాలివేసింది. మెల్లగా దగ్గరగా వెళ్ళాను. పెరిగిన గెడ్డాం జుత్తుతోనున్న ఆ యెముకలగూడు కొద్దిగా కంపు వేస్తోంది. ఇంకా ప్రాణం వున్నట్టు చిన్న మూలుగు చెప్తోంది.

'ఏంయ్.'

'హుఁ' అని మూలిగాడు. ఆ బాధ వాడి చివరి గడియలని చెప్తోంది.

'నీ కెవరూ లేరా?'

'లేకేం? నివ్వున్నావుగా.'

'నేనా?' అన్నానే గానీ చప్పున ఆ మాటలు మా నాన్న అన్నట్టే అనిపించాయ్.

'దేముడు నిన్ను పంపించాడు.'

'నన్నా?'

'అవును. నా అంత్యక్రియలు నివ్వు జరిపిస్తావని.'

ఒక్కసారి ఒళ్ళంతా జలదరించింది. అతను మెల్లగా కదలి 'అందుకు కాకపోతే యీ రాత్రిలో యిక్కడి. కెందుకు వచ్చావు నాయనా?'

'చచ్చిపోడానికి' అన్నాను.

'అయ్యో తండ్రీ చచ్చి యేం సాధిస్తాం. చేతకానివాడే బలవంతంగా ప్రాణం తీసుకుంటాడు. అలాంటి ప్రాణినించి ఆత్మ కూడా ముందుగానే యెగిరిపోతుంది. ఛీఛీ ...అధైర్యంతో అప్రయోజకుడైపోతావా?'

కొన వూపిరితో ఆ సాధువు యిలా అనగానే నాపై నాకే అసహ్యం వేసింది. ఎలాగైనా బ్రతికి తీరాలని భీష్మించుకున్నాను. అతను! మరి నాతో చాలాసేపటివరకూ మాట్లాడలేదు. వెన్నెల్లో మంచులో అతని దగ్గరగా కూర్చున్నాను. చాలా ఆయాస పడుతున్నాడు. దగ్గుతున్నాడు. చివరకు

అతని పరిస్థితి చూసి ముట్టుకోకుండా వుండలేకపోయాను. అతనిని ముట్టుకోగానే నా ఒళ్లంతా ఒక్కసారి జర జరలాడింది. ఏదో కరంటులాంటి శక్తి ప్రవేశించినట్లయింది. అతనిని వదలి వెళ్ళలేకపోయాను. రాను రాను నాలో ధైర్యం చొచ్చుకుంది. అతను వేకువఝామున మాటాడాడు.

'నింద లేకపోతే బొందె పోదు. సంతోషంగా చచ్చిపోతున్నాను.'

'చావు సంతోషమా ?'

'ఈ ప్రపంచమంతా నటనే బాబూ! నీ ప్రేమ, అభిమానం, కోపం, తాపం—అంతా నటించటంవలసి వస్తుంది. ఇది అసలు ప్రేమ కాదు. నివ్వు ఒక్కరినే ప్రేమించగలవు. అతనిని నివ్వు చూడలేవు కానీ అతను నీ చుట్టూవట్టు నీలోనూ వున్నట్లే ఆ కనిపించని స్పర్శ నమ్మకాన్ని కలిగిస్తుంది. నీ యిష్టం—ఆ స్పర్శకు నీకు నచ్చిన రూపాలను యిచ్చి ప్రేమించుకో—చావు కూడా ఒక నటనే అని నీకు తెలుస్తుంది.'

అంటూ అతను తన చివరి అంకం నటించేసాడు. తెల్లవారింది. ఆ శవంవేపు చూసి నేను యేడవలేదు. అతను చచ్చిపోయాడని నా మనసులోను తట్టలేదు. నా హృదయంలో అతను యీనాటికీ బ్రతికే వున్నాడు. నా తండ్రి చివరి ఋణం తీర్చుకోలేకపోయినా నా తండ్రి యివ్వాళ్ళ నాకు యివ్వలేని ధైర్యాన్ని యిచ్చిన యీ సాధువు క్రింద చేసే అదృష్టం నాకు కలిగింది. నాకు తెలుసు యీ శవాన్ని చూడటానికై యెవరూ రారని. పరుగెత్తి ప్రేమ సమాజానికి వెళ్ళాను. ప్రోవలో యింటి దగ్గర ఆగి నా దగ్గరవున్న డబ్బంతా జేబులో పెట్టాను. వాళ్ళతోపాటు నేనూ ఒక కొమ్ము పట్టాను. వాళ్ళు పాతేద్దామంటే కర్రలకు డబ్బు నేనే యిచ్చాను. నేనే తలకు నిప్పంటించాను. అప్పటికిగనీ నా కళ్ళల్లో నీళ్ళు తిరగలేదు. ఇతను యెవరు? పేరేమిటి? ఇతనికీ నాకు సంబంధమేమిటి ? దేవుడు నాచేత యివన్ని యెందుకు జరిపిస్తున్నాడు? ఇలా నాలో యెన్నెన్నో ప్రశ్నలు వుదయించాయి. సమాధానాలు తట్టి మనస్సును ప్రకాశింపచేసాయి.

(ఇంకా వుంది)

## పిల్లలు-ఆరోగ్యము

# ప్రైమరీ కాంప్లెక్స్



ప్రైమరీ కాంప్లెక్స్ అన్నది ఈ రోజుల్లో సాధారణంగా అందరూ వింటూనే ఉంటారు. దీన్ని గురించి ప్రతివారూ తెలుసుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది.

సాధారణంగా ప్రతివ్యక్తి ఎప్పుడో ఒకప్పుడు క్షయవ్యాధిని కలిగించే సూక్ష్మ క్రిములు (టి.బి.బాసిల్లస్)కి గురి కావటం జరుగుతుంది. మొట్టమొదటిసారి ఈ సూక్ష్మక్రిములు శరీరంలో ప్రవేశించినప్పుడు కలిగే మార్పులనే ప్రైమరీ కాంప్లెక్స్ అంటారు. ఈ క్రిములు గాలి, నీరు ద్వారా శరీరంలో ప్రవేశిస్తాయి. పిల్లలలో తరుచుగా గొంతు నొప్పి, టాన్సిల్స్ వాయడం, మెడలో ఉన్న లింఫ్ గ్రంధులు వాయటం జరుగుతుంది. ఈ క్రిములు గాలి ద్వారా ఊపిరితిత్తులలో ప్రవేశించినప్పుడు వాటిలో ఒకభాగం వాస్తుంది. తర్వాత ప్రక్కనున్న గ్రంధులుకూడా వాస్తాయి.

నీటిద్వారా ఈ క్రిములు శరీరంలోకి ప్రవేశించినప్పుడు పిల్లలకి విరోచనాలు అవటం, ఆకలి లేకపోవడం జరుగుతుంది. ఈ క్రిములు శరీరంలో ప్రవేశించినప్పుడు పిల్లల శరీరారోగ్యం సరిగా ఉంటే శరీరంలోని రోగ నిరోధక శక్తి వాటిని అణచివేస్తుంది.

సరైన పోషణలేని పిల్లలలో ఆ క్రిములు క్రమంగా వృద్ధిచెంది ప్రోగ్రసివ్ ప్రైమరీ కాంప్లెక్స్‌గా మారుతుంది. దీనితో బాధ పడుతున్న పిల్లలు రోజురోజుకీ చిక్కిపోయి బలహీనులుగా ఉంటారు. ప్రతిరోజూ సాయంత్రం ఒళ్ళు వెచ్చగా ఉంటుంది. శరీరంలో రక్తం తగ్గిపోయి 'ఎనీమియా' వస్తుంది. ఎక్కువగా చెమట పోస్తుంటుంది. కొందరు పిల్లలకి జ్వరం, దగ్గు, జలుబు వస్తాయి. మరి కొందరికి విరోచనాలు అవుతాయి.

పిల్లలకి తరచు దగ్గు, జలుబుగా ఉంటూ ఉంటే డాక్టర్‌కి చూపించాలి. అలాగే తరచు విరోచనాలు అవుతూన్నా వైద్య సహాయాన్ని వెంటనే పొందాలి.

ఇంట్లో, లేక చుట్టుపక్కలవారిలో ఎవరికైనా క్షయరోగం ఉంటే, ఈ క్రిములు శరీరంలో ప్రవేశించడానికి అవకాశం ఉంది. లేక పిల్లలు చదువుకునే స్కూల్‌లో ఎవరికైనా ఈ వ్యాధి ఉంటే మిగతావారికి కూడా వచ్చే అవకాశం ఉంది.

అసలు ఈ వ్యాధి ఉందా లేదా అన్న విషయాన్ని 'మాంటో టెస్ట్' ద్వారా తెల్సుకో వచ్చు. పిల్లలకి తరచు దగ్గు, జలుబు, జ్వరం వస్తూ ఉంటే ఎక్స్‌రే తీయించడం మంచిది. ఇంట్లో పెద్దవారికిగానీ, చిన్నపిల్లలకి గానీ దగ్గు ఉంటే దగ్గేటప్పుడు నోటికి చేతిరుమాలు, లేక తుండుగుడ్డని అడ్డం పెట్టుకోవాలి.

క్షయరోగం ఉన్నవారు పిల్లలని ఎత్తుకోడం, ముద్దుపెట్టుకోడం చేయకూడదు. వారు ఉపయోగించే గ్లాసులు, గిన్నెలు, పళ్లెలు వేరుగా పెట్టుకోవాలి. ఎక్కడపడితే అక్కడ ఉమ్మి వేయకూడదు. మూకుడులాంటి దాంట్లో ఉమ్మివేసి దాన్ని రోజుకొకసారి ఒక గోతిలో పోసి కిరోసిన్‌తో తడిపిన గుడ్డతో దానిని కాల్చివేయాలి. ఇంట్లో ఎవరికైనా క్షయరోగం ఉంటే మిగిలిన వారందరికీ బి.సి.జి. వాక్సినేషన్ వేయించాలి.

అందుకే పిల్లలు పుట్టిన మర్నాడే బి.సి.జి. వాక్సిన్ వేయించాలి. క్షయని అరికట్టడానికిది ఉత్తమమైన మార్గం.

క్షయవ్యాధి విపరీతంగా ప్రబలిపోవడానికి కారణం ఈ రోగులు క్రమంగా ఇంజక్షన్లు, మాత్రలు, సరైన ఆహారం తీసుకోకపోవడమే. కొంతమంది మూడునాలుగు నెలలు మందులు తీసుకొని తర్వాత మానేస్తారు. అప్పటికి వారికి వ్యాధి ఉద్రేకం తగ్గినా అది పూర్తిగా నిర్మూలింపబడదు. మందులు తీసుకోడం మానగానే మరల క్రమేణా అది శరీరంలో వృద్ధిచెందుతుంది. ఇటువంటివారు తమకి తాము ఆపదని కొనితెచ్చుకోడమే కాక సమాజానికి కూడా ముప్పు తెస్తున్నామని గుర్తించుకొని వ్యాధి పూర్తిగా నిర్మూలింపబడేదాకా జాగ్రత్తగా చికిత్స చేయించుకోవాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

—డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

# పెద్దకథ:




సుశీల.

పకుల కిల కిలా రావాల్తో పిల్ల తెమ్మెరలు సన్నగా ఊదే మలయమారుత రాగాల మధ్య, ఉభయ సంధ్యల్ని చూస్తూ కూర్చోవటమంటే నాకెంతో ఇష్టం. సంధ్యారుణ శోభను తిలకిస్తూ తన్మయత్వంలో తేలాడేదాన్ని. ఆ తన్మయత్వంలోనుంచి చటుక్కున నాలో ఓ ప్రశ్న జనించేది: ఉదయాస్తమయాల్లా మానవజీవితపథానికి గూడా ఓ న క్రమగతి వుంటుందా అని...

సాగిపోయే కాలంతోబాటు సాగి ముందుకు నడచే జీవితాల్ని పరికిస్తే ఏ రెండు జీవితాలూ ఒకటిగా కనిపించవు. ఒకే పథంలో పడుస్తున్నట్లు తోచినా ఏ ఇద్దరి జీవితాలకూ పోలికలే లేవు. ఏ జీవితం సూటిగా నడచే బాటలాంటిది గాదు. ప్రతి జీవితంలో ఎన్నో వంపులు...ఎన్నో సంధ్యలు...ఎన్నెన్నో ఉదయాస్తమయాలు...

సత్యం :

సుశీల చెప్పింది నిజం; రోజుకు సంధ్యలు రెండే (మధ్యాహ్న సంధ్యతో కలుపుకొని మూడు) ... కాని జీవితంలో ఎన్నో సంధ్యలు ... ఎన్నో మలుపులు...ఆ సంధ్యల మలుపుల్లో చిక్కుకొని ఉక్కిరిబిక్కిరవటం నా కిష్టంలేదు. రోజులా జీవితాన్ని రెండు సంధ్యల మధ్యనే మలచుకోవాలని, ఉభయ సంధ్యలమధ్య జీవితాన్ని ఓ సరళరేఖగా రూపొందించుకోవాలని నా ఆశయం. అదే నా కల, తీయటి కల...

ఓ రోజున, బీచ్‌లో సంధ్యారాగాన్ని తిలకిస్తున్న సుశీలను చూశాను; ఆమె ఎవరో కాదు, నా కాలేజ్ మేట్; అంతకుమించి నాన్నగారి ప్రాణస్నేహితుడి కుమార్తె. మా ఇద్దరిమధ్య పరిచయం పెరిగింది. తరచూ బీచ్‌లో కలుసుకునేవాళ్ళం. శని ఆదివారాలు వాళ్ళింట్లో బాతాఖానీకి కూర్చొనేవాళ్ళం. మా ఇద్దరి అభిరుచులూ చాలావరకూ ఒకటేనని గ్రహించాను. తరచూ సినిమాలు చూచేవాళ్ళం. నవలలు చదివి అభిప్రాయాలు

మార్చుకునేవాళ్ళం...

**సుశీల:**

సత్యం, నేనూ చాలా విషయాల్లో ఏకీభవించేవాళ్ళం. రోజూ సాయంకాలం అతడు మా ఇంటికి వచ్చేవాడు. ఎప్పుడూ నవ్వుతూ వుండేవాడు. అందర్నీ నవ్విస్తుండేవాడు. అతడంటే ఇంట్లో అందరికి వల్లమాలిన అభిమానం యేర్పడింది. అతడు ఒకరోజు రాకపోతేసరి, మా ఇంట్లో అందరూ ఓ కుటుంబ సభ్యుడు తగ్గినట్లు వెలితి ఫీలయ్యేవాళ్ళం. ఇక నా విషయమా, ఏమిటో మనసు బోసిగొట్టుతున్నట్లనిపించేది. దిగాలుగా కూర్చుండిపోయేదాన్ని. దిక్కులు చూస్తూ గడిపేదాన్ని. నా జీవితంలో సత్యం ఓ క్రొత్త మలుపు; ఒక నవోదయం; ఆ మలుపుకు ఆవలి జీవితం సూటిగా పయనించే రహదారిలా వుంటుందని, ఆ ఉదయం మరి అస్తమయమే లేనిదేనని ఏమేమో కలలు కనేదాన్ని.

**సత్యం:**

సుశీల హృదయంలో కలలు రేగాయని నాకు తెలుసు; అవును, ఆమెలో కలలు చిలికింది నేనే మరి. ఆ కలలరేపు పెళ్ళనటంలో సందేహం లేదు. పెళ్ళి చేసుకోవాలనుకుంటే ఆమెనే చేసుకోవాలనుకున్నాను. కాని నాకు పెళ్ళి చేసుకోవాలని లేదు. పెళ్ళనగానే మనస్సు భవిష్యత్తును గూర్చి పరి పరివిధాల ఆలోచించేది. పెళ్ళి చేసుకుంటే నాలో మలుచుకున్న కలలు మంచు తెరల్లా కరగిపోతాయేమో అని సందేహం...

**సుశీల:**

పెళ్ళి అనె మాట వినబడితే చాలు, సత్యం ఎందుకో మౌనం వహించేవాడు. నన్ను పెళ్ళి చేసుకోవటం అతడికి ఇష్టం లేదా! ఉహూ, అదేం కాదు, నేనంటే అతడికెంతో ఇష్టం. కథల్లోని నాయకుడిలా నా అందాన్ని వర్ణించకపోయినా, నన్ను పొగడ్తలతో ముంచెత్తకపోయినా, నన్నతడు ఎంతగానో ప్రేమిస్తున్నాడని నాకు తెలుసు మరింతగా ప్రేమించేవాడు పెళ్ళిచేసుకోటానికేం! అసలతడికి పెళ్ళి చేసుకోవటమే ఇష్టంలేనట్టుంది. అతడ్ని వేధిస్తున్న సమస్య ఏంటో చెప్మా!...

**సత్యం:**

పెళ్ళనేది జీవితయాత్రలో ఓ మైలు రాయి; మరువలేని మలుపు; ఇద్దరి భవిష్యత్తు; సంతానోపనిషత్తు. అందుకే పెళ్ళంటే నూరేళ్ళపంటన్నారు...కాని...

**సుశీల:**

కానిల్నీ, అయితేల్నీ, కొత్తదనం లేని పాతనిర్వచనాలకు జోడించి ఏమేమో చెప్పటమేగాని, అసలు తన అభిప్రాయం యేంటో సత్యం బయటపెట్టడు. పెళ్ళంటే ఎందుకీమౌనం అని అడిగాను... మొదట పై చదువులు చదవాలని వుందన్నాడు. పూర్తైన తర్వాత సరైన ఉద్యోగం దొరకాలిగా అన్నాడు. ఉద్యోగం వచ్చినా పెళ్ళి ఊసే యెత్తడు. ఈ విషయంగా అతడ్ని ఒత్తిడి చేయటానికి తల్లీ తండ్రీ లేరు; చిన్ననాడే పోయారు; అయినవాళ్ళు ఎవరైనావున్నా అతడు వారిని లెక్కచేయడు...

అతడి మౌనం నాలో పలురకాల సందేహాల్ని రేపింది. అతడ్ని సరిగా అర్థంచేసుకోలేకపోయానా...

**సత్యం:**

సుశీల ఆమధ్య ఎందుకో ఓ మాదిరిగా వుంటోన్నది. నన్ను ఏమో అడగాలనుకుని అడగలేకపోతున్నదేమో అనినా అనుమానం...ఆరోజు సాయంకాలం బీచ్‌లో కూర్చుని వున్నాం; రోజూ ఏమేమో చెప్పుకుపోతూవుండే ఆమె ఆరోజు ఎందుకో మూగనోముపట్టినట్లు మౌనంగా కూర్చుంది. భూమి గుండ్రంగా వుందనటానికి నిదర్శనగా కనిపిస్తున్న నీలిఆకాశాలుకు దిగువన కుంగిపోతున్న సూర్యబింబాన్ని చూస్తూ ఏమో ఆలోచిస్తున్నది...

మాకు ఏకాంతాన్నివ్వటానికా అన్నట్లు బీచ్ నిర్జనంగా వుంది. అటునుంచి విని పిస్తున్న సముద్రపుహోరు తప్ప మా ఇద్దరిమధ్య మౌనమనే నిశ్శబ్దం ఆవరించింది.

క్షణాలు...నిముషాలు గడుస్తున్నాయి...

'ఏమిటా పరధ్యానం సుశీ! నీ ఆలోచనల్నీ నాకూ పంచియివ్వగూడదూ.' అంటూ మౌనాన్ని భగ్నం చేశాను.

**సుశీల:**

ఎలా అతడివద్ద ప్రస్తావన తీసుకురావటమా అని సతమతమౌతున్న నన్ను అతడు పలకరించటం ఓవిధంగా మంచిదే అయింది. కాని ఏం సమాధానం చెప్పాలో నాకు వెంటనే తోచలేదు. విరుచుకు పడుతున్న కెరటాన్ని చూస్తూ,

'మరేంలేదు సత్యం, విరుచుకుపడే కెరటాల్ని చూస్తుంటే, కేరింతల్తో గడచిన చిన్నారితనం గుర్తుకొస్తున్నది' అన్నాను.

'ఇంకా నయం, ఆ కెరటాల్తోపాటు అల్లరిచేయాలనిపిస్తున్నదనిగూడా అన్నావు కాదు' అన్నాడు సత్యం నవ్వుతూ.

అతడి మాటలకు నాకు నవ్వాగింది కాదు. నవ్వాపుకోటానికి ప్రయత్నించటంలో నాకు నువ్వు గింజంత, సత్యం గోచరించినట్లయింది. 'ఆ కెరటాల్ని చూస్తుంటే జీవితానికి, సముద్రానికి ఎంతో పోలిక వున్నట్లు అనిపిస్తుంది గదూ...' అన్నాను.

సత్యం పెదవులమీద చిరునవ్వు తళుక్కుమంది.

'ఎందుకా నవ్వు...' అడిగాను అర్థంగాక.

'కోపం రాకపోతే చెప్తాను...' అన్నాడు సత్యం.

'అయితే చెప్పి తీరాల్సిందే; కనీసం నిజాలు చెప్పావన్న సంతృప్తి వుంటుంది...' అన్నాను.

'నే చెప్పాలనుకుంది నా మాటాగాదు, నీ మాటా గాదు. మరెవరో చెప్పినమాట; లోతుల్లో సముద్రం, స్త్రీహృదయం ఒకటే నంటారు; రెండూ అందనివే; అంతుచిక్కనివే...' చెప్పాడతడు

'బహుశా స్త్రీహృదయం తెలియని హృదయంలేని నీబోటివాళ్ళెవరో అని వుంటారు...' అన్నాను, లోలోపల అతడికి సరైన సమాధానం చెప్పగల్గాననుకుంటూ.

'అంటే నాకు హృదయం లేదనా!' పాలిపోయిన ముఖాన్ని కప్పిపుచ్చుకోటానికి లేని నవ్వును తెచ్చిపెట్టుకుంటూ అడిగాడు సత్యం

'ఓహ్, నీకు హృదయంవుంది కదూ! పొరపాటైంది, ఏమీ అనుకోకు...' అన్నాను ఓదారుస్తున్నట్లు.

'అనుకోటానికేముంది సుశీ, నీమాటల గమ్యం అర్థమవుతూనే వుంది...' అన్నాడు సత్యం.

'అర్థమైతే సమాధానం చెప్పవేం సత్యం! సూటిగా అడగలేదనా! సరే అయితే, ఇంకా ఎంతకాలమని ఈ ఒంటరి జీవితం...' అడిగాను.

# జీవన సంధ్యలు

'నీకు తెలీదు సుశీ. జీవితంలో సెటిల్ గాందే పెళ్లి చేసుకోవటంవలన ఎన్నో సమస్యల్ని ఎదుర్కోవాల్సొస్తుంది...' సత్యం అనంతంలోకి చూస్తూ అన్నాడు; పెళ్ళైతే అనంతమైన సమస్యలొచ్చి పడేట్లు...

'సెటిల్ అవటమంటె ఏంటో నాకు అర్థంగావటంలేదు సత్యం. సృష్టి జరిగి ఇన్నియుగాలైనా ప్రపంచమే సెటిల్ గాలేదు...' అన్నాను.

'అందుకే ప్రపంచంలో ఎప్పుడూ ఏదో ఒకమూల అల్లకల్లోలం రేగుతూ వుంది; అశాంతి చెలరేగుతూ వుంది; స్థిరంలేని జీవితంగూడా అంతే...' నగ్నసత్యాన్ని చెప్తున్నట్లు అన్నాడు సత్యం.

'మనసు స్థిరమైనదైతే జీవితం దానంతటదే స్థిమిత పడుతుందంటారు. లోకంలోని అందరూ నీలా ఊహిస్తూకూర్చుంటే అసలు పెళ్లిళ్లే జరగవేమో...' అన్నాను నిట్టూరుస్తూ.

'జరుగుతున్న పెళ్లిళ్లలో ఎందరు సుఖపడుతున్నారు సుశీ! నిరాశ నిట్టూర్పుల్లో గడిపేవాళ్ళు, అసంతృప్తిని పైకి వెళ్లడించలేక లోలోపల క్రుంగేవాళ్ళు, కర్మ అనే మెట్ట వేదాంతంలో లేని తృప్తిని నటిస్తూ ఆత్మవంచన చేసుకునే వాళ్ళు...వీళ్ళే యెక్కువ...' సత్యం పెదవులనుంచి నిట్టూర్పు దిగజారింది.

'ఎడబాటుల్ని, విడాకుల్నిగూడా చేర్చలేదేం...' లోలోపల నవ్వుకుంటూ అడిగాను.

సత్యానికి నవ్వాగింది కాదు; 'అట్టే అటువంటివాళ్లను, వ్రేళ్లమీదే లెక్కించవచ్చు; ఇంకా మనసమాజం నాటికి అంతగా అలవాటు పడలేదుగా...' అన్నాడు.

'ఊహూ, బాగుంది పెళ్లి అనే విషయంపై నీ పరిశోధన; కాని నేను అడిగింది ఎంతకాలం ఈ ఒంటరితనమని...' అడిగాను, ఈసారి సమాధానం చెప్పకుండా తప్పించుకోలేడనుకుంటూ ...

'నిజం చెప్పమంటావా!' అంటూ సత్యం నావైపు నిశితంగా చూశాడు. 'అయితే విను; ఈ ఒంటరి జీవితమే నాకెంతో హాయిగా వుంది సుశీ. నాగూర్చి నువ్వు, నీగూర్చి నేను నిరంతరం ఆలోచిస్తూ వుండొచ్చు...' అన్నాడు.

'పెళ్లయితే ఒకర్నిగూర్చి ఒకరం ఆలోచించుకోమనా నీ ఉద్దేశ్యం...' అడక్కుండా వుండలేక పోయాను.

'తీరిక యెక్కడుంటుంది సుశీ! ఇల్లూ, పిల్లలు, సంసారం, బాధ్యతలు, ఈ తాపత్రయాల్లో లోకంలోని అనేకుల్లా మనమూ ఒకళ్లమైపోతాం; ఒకర్నిగూర్చి ఒకరం ఆలోచించుకునే వ్యవధిలేక సతమతమౌతూ అనామకులమే అవుతాం...' అన్నాడు సత్యం.

నాకు నవ్వాగిందిగాదు. 'అనామకులమైపోతామనే దిగులుతో అవివాహితులుగా వుండిపోవటం అవివేకమే అవుతుందేమో. అంతగా మనపై మనలో నమ్మకం లేనపుడు ముందుగానే తాజ్ మహల్‌లాంటి స్మృతిచిహ్నాన్ని నిర్మించుకుంటే సరి...' అన్నాను; ఆ చివరిమాటలు నాకు తెలీకుండానే అన్నాను; ఏమన్నానో తెలుసుకున్న తర్వాత షాజహాన్ చక్రవర్తుల పవిత్ర ప్రేమను కించపరచానేమో అని ఓ విధమైన బాధకు లోనయ్యాను.

సత్యం మాటలు ఆ బాధను మెలి తిప్పాయి. 'అవి చక్రవర్తులకు మాత్రమే చెల్లుతాయి సుశీ. చనిపోయినవారికోసం స్మృతి చిహ్నాల్ని నిర్మించగలరూ; చావక ముందే సమాధులూ కట్టుకోగలరు...అంటే చక్రవర్తుల ప్రణయానికీ, సామాన్యుల ప్రేమకు వ్యత్యాసముంటుందని గాదు; ఆ మాటకొస్తే చక్రవర్తులకంటే సామాన్యుల ప్రేమ ఎంతో నిస్వార్థమైంది; పవిత్రమైంది; తాజ్‌మహల్ నిర్మాణ కథను తీసుకుంటే ఆ సత్యం వెల్లడవుతుంది...' అన్నాడు సత్యం నిట్టూర్పులు రాలుస్తూ.

అతడి నిట్టూర్పుల్లోనుంచి తాజ్ మహల్‌ను గూర్చి చెప్పుకునే ఓ కథ తళుక్కుమని మెరిసింది. బీదరికంలో కుమిలిపోతున్న ఓ మహాశిల్పి, ప్రియురాలికి పుట్టినరోజు కానుకగా ఇవ్వటానికి ఏమీ లేక, పాలరాయితో ఓ బుల్లి బొమ్మరిల్లు మలచాడు. అది షాజహాన్ చక్రవర్తుల దృష్టిలో పడింది. భార్య ముంతాజ్ మహల్ స్మృతి చిహ్నాన్ని నిర్మించటంకోసం కళాఖండాలనదగిన ఎన్నెన్నో నమూనాలను పరిశీలించి తృప్తిలేకపోయిన చక్రవర్తుల మనసును ఆ పాలరాతి బొమ్మరిల్లు ఎంతగానో చూరగొంది. కాని ఆయనలో స్వార్థం ప్రబలింది; అటువంటి కళాఖండాన్ని సృష్టించిన శిల్పి అంతకుమించిన అపూర్వ కళాఖండాల్ని సృష్టించగలడనటంలో సందేహం లేదు. అప్పుడు ముంతాజ్ స్మృతి చిహ్నానికి విలువేం వుంటుంది! అందుకని, ఆ శిల్పి మరో శిల్పాన్ని సృష్టించకుండా చక్రవర్తి అతడ్ని రహస్యంగా చంపించాడంటారు. ఈ కథే నిజమైతే షాజహాన్ చక్రవర్తిని ప్రపంచం క్షమించలేదనటం నిజం...

**సత్యం :**

తాజ్‌మహల్ కథ విని సుశీల మనసు పరి పరి ఆలోచనలకు గురైందని ఆమె ముఖమే చెప్తున్నది. మరి 'ముఖం మనసుకు అద్దం' అన్నారుగా. నిజంగా సుశీలను చూస్తూ కూర్చుంటే కాలం తెలియకుండానే గడచిపోతుంది. కాని కలలుకంటూ కూర్చుంటే పొద్దు గడుస్తుంది గాని జీవితం గడవదుగా అంది సుశీల! ఆ మాట అని 'ఎవరి పిచ్చి వాళ్లకానందంలే ...' అంటూ, 'వెళ్దాం ఇక ఇంటికి, ఇంకా ఎందుకు ఈ చల్లగాలిలో' అని లేవబోయింది. కానంతలో మిత్రుడు రఘు మాముందు సాక్షాత్కరించాడు. వాణ్ని చూచి చాలా కాలమైంది; యూనివర్సిటీ వదిలినతర్వాత ఒకసారో రెండుసార్లో కలిశాం అంతే.

సుశీని చూసి, 'ఎవరు వదినగారేనా! పార్టీ ఇవ్వాల్సొస్తుందని పిలుపూ పేరంటం లేకుండానే గుట్టుగా పెళ్లిచేసుకున్నావన్నమాట.'. అన్నాడు రఘు.

'అసలు పేరంటం అనేది వుంటే నిన్ను పిలువకుండా జరుగుతుందా! జరిగినా పిలవకుండానే రాగలహక్కు నీకుందిగా.' అన్నాను.

'అయితే ఇంకా మూడుకోతుల మఠంలోనే సీతంవేసు కూర్చున్నావన్నమాట...' అంటూ నవ్వాడు రఘు.

'పీఠాధిపతివి నువ్వు తప్పుకుంటేవిగా' అంటూ అతడ్ని సుశీకి పరిచయం చేశాను. హైస్కూలునుంచి యూనివర్సిటీ కాలేజీవరకూ ఇద్దరం ఒకే బెంచీ మీద కూర్చున్నాం.

'అంతేకాదండీ, ఒకే కంచానగూడా తిన్నాం...' అన్నాడు రఘు.

'అంటే మరేంలేదు, కారియర్ భోజనం ...' అన్నాను నేను నవ్వుతూ.

— 'ఓష్, ఎంగిలైనా అనేదెవరు, ఇద్దరూ

ప్రాణస్నేహితురాలేగా...' అంది సుశీల.

'ఫ్రెండ్స్ విషయం ఏమైనా రేపు పెళ్ళయితే ఎంగిలంటకుండా ఎలా గడుస్తుంది...' అంటూ ఛలోక్తి విసిరాడు రఘు.

'ఒరేయ్ రఘూ, పెళ్ళయి పిల్లలు పుట్టినా ఇంకా వాలంలేని వానరతత్వం పోనిచ్చావుగాదు...' అన్నాను మందలిస్తూ స్నేహితులు నటిస్తూ

'లేకపోతే మరేంటోయ్, పెళ్ళివిషయం అడుగుతుంటే ఇంకేమేమో చెప్తావేం...' అన్నాడు రఘు.

'ఆ ఊసుమాత్రం యెత్తకండి కాషాయాంబరాలు ధరించి జై పరమేశ్వరా అంటూ పారిపోగలడు...' సుశీల నావైపు చిలిపిగా చూస్తూ అంది.

'అయితే కొంచెం జాగ్రత్తగానే వుండాలి; పారిపోవటం జరిగితే మరి దొరకడు...' సుశీలను హెచ్చరిస్తున్నట్లు అన్నాడు రఘు.

'పెళ్ళికి భయపడి పారిపోయే పిరికి వాణ్ణి కాను, పట్టుకున్నా, వ్వర్చాల్సిన బెడదేం లేదు. పదండి వెళ్దాం...' అన్నాను ఆ ప్రస్తావన మార్చాలని.

'ఎక్కడికి, పెళ్ళికా!' అడిగింది సుశీ, కొంటెగా.

'ఫస్ట్‌షో సినిమాకి'...చెప్పాను.

'అంతేగదా, సారీరా సత్యం, నేను రాత్రి మెయిల్లో తిరిగి వెళ్లిపోవాలి, ఈలోగా కొంచెం షాపింగ్‌పని వుంది...' అన్నాడు రఘు.

అర్జంట్ పనిమీద ఉదయమే వచ్చాడట, పనైపోయి వెంటనే వెళ్ళక తప్పదన్నాడు. చాలాకాలం తర్వాత కలిసాం. ఆ రాత్రికి వుండిపొమ్మన్నా వినలేదు.

ముగ్గురం బీచ్‌నుంచి బయలుదేరాం. సుశీలను దార్లో ఇంటివద్ద విడచి, రఘుతో షాపింగ్‌కు వెళ్ళాను.

# జీవన సంధ్యాలు

**సుశీల :**

ఆ రోజు తర్వాత చాలా రోజులవరకూ సత్యం కనిపించలేదు. ముఖం చాటు చేయటానికి కారణం యేమిటి ? రకరకాల సందేహాలు నాలో రేగాయి. అతడిమీద కోపంకూడా వచ్చింది. ఆ కోపంలోనుంచి ఉక్రోషం చెలరేగి ఏమేమిటో పిచ్చిపిచ్చి ఆలోచనలు మూగాయి. అసలు స్త్రీకి వివాహం దేనికి? భర్తకు సేవచేయటానికి, పిల్లల్ని కనడానికేనా! అంతలో నా ఆలోచనలకు నాకే నవ్వొచ్చింది.

బామ్మ వింటే మరేమైనా వుందా, "ఏమిటేవ్! చదివేస్తే వున్నమతి పోయినట్టు...' అంటుంది. సత్యం రానందుకు నాకంటే ఆమెకే ఆందోళన ఎక్కువగా వుంది. ఏమయ్యాడు! ఇంటికి రావటం లేదేం! పదేపదే అడగటం...

నాకు విసుగుపుట్టింది, "ఏమయ్యాడో ఎవరికి తెలుసు, నాకేమైనా చెప్పి వెళ్ళాడా' అన్నాను చిరాకుతో.

ఏమనుకుందో ఏమో గదిలోకి వెళ్ళి గొణుక్కో సాగింది. ఆమె సణుగుడును భరించలేక పనికుర్రవాడ్ని సత్యం వుంటున్న లాడ్జికి పంపాను. గదితాళం వేసి వుందట; వాకబుచేస్తే నాలుగైదు రోజులుగా గది తాళం వేసేవుందని, ఎక్కడకు వెళ్ళిందీ తెలీదని చెప్పారని చెప్పాడు వాడు. సత్యం మాట మాత్రమైనా చెప్పకుండా ఎటు వెళ్ళాడు! నిజంగానే జీవితంమీద విసుగుపుట్టి ఏ స్వైనా పారిపోయాడా! కనీసం జాబైనా వ్రాసేవాడే; ఎందుకు వ్రాయలేదు! నాలో కోపం పొంగింది; దుఃఖం చెలరేగింది. డాబామీద కూర్చొని సూర్యాస్తమయాన్ని చూస్తూ మనసుకు ఊరట చేకూర్చుకుందా మనుకున్నాను. అస్తమయ సూర్యుని చూస్తుంటే జీవితం ఏదో కొత్తమలుపుకు తిరుగుతున్నట్లనిపించింది. ఏమిటో ఆ మలుపు!...

**సత్యం :**

గ్రామంలో, పసిడిపొలాలకు అవల, నేల నింగి కౌగిలిలో కరగిపోతున్నట్లనిపిస్తున్నట్లు భ్రాంతిని కల్గిస్తున్న తావున క్రిందకు జారిపోతున్న సూర్య బింబాన్ని చూస్తూ కూర్చున్నాను. జీవితం ఎందుకో క్రొత్త మలుపులకు మళ్ళినట్లనిపించింది. సంధ్యారుణ రాగం వెదజల్లే అరుణిమతో ప్రకృతి సంపూర్ణతను పుంజుకున్నట్లు మనసు పులకలకు లోనైంది. కాని ఆ పులకల్లో ఏదో వెలితి...సుశీల గుర్తుకొచ్చింది.

రఘు బలవంతం చేయటంవలన అతడితోబాటు మెయిల్ యెక్కాను. సుశీలకు చెప్పిరావటానికి వ్యవధి లేకపోయింది.

'ఇంతలోనే ఏమనుకుంటుందిలే, శని ఆదివారాలు పల్లెలో గడపి సోమవారం ఉదయం తిరిగి చేరుకుంటావుగా...' అన్నాడు రఘు. కాదనలేక పోయాను...

పల్లెలో రెండురోజులు రెండుక్షణాల్లా గడచిపోయాయి. రఘు నన్ను వదలలేదు. అతడేగాదు, ముచ్చటగా వున్న అతడి ఇల్లు, కుటుంబం, పల్లె వాతావరణం నన్ను కదలకుండా చేశాయి. రఘును అతడి భార్యను చూస్తుంటే ఒకరికోసం ఒకరు పుట్టారా! అనిపించింది. తోడు రత్నాల్లాంటి ఇద్దరుపిల్లలు...పెళ్లిచేసుకోవటంలో ఆనందమేంటో నాకప్పుడు బోధపడింది...

పెళ్లనేది జీవితానికి నిండుతనాన్ని చేకూరుస్తుందనటం నిజం. స్థిరమైన ఉద్యోగం, బ్యాంకు ఎకౌంటు, హాయిగా తిరగటానికి మోటారుకారు, ఇవన్నీ



వుంటేనేగాని పెళ్ళి చేసుకోగూడదనుకునే నేను, ఇవేమీ లేకుండా పల్లెపట్టులో హాయిగా, సుఖంగా జీవిస్తున్న రఘూను చూసి అంతకాలం జీవితాన్ని వృధాచేశా ననుకున్నాను. సుశిగూడా వచ్చివుంటే ఎంత బాగుండేది.

చెప్పకుండా వచ్చినందుకు ఏమను కుంటుందో! పారిపోయాననుకుంటుందా! విరాగినై బైరాగి టిక్కెట్ పుచ్చుకున్నా ననుకుంటుందా...మనసు పట్నం పైకి మళ్లింది. సుశిల ముచ్చటాలని చెప్పాలని... విశేషాల్ని చెప్పాలని...అంతకుమించి ఇంకా ఏమేమో చెప్పుకోవాలని...

రఘుతో చెప్పి బయలు దేరాను...

(ముగింపు పైవారం)

# వారఫలం

**19-5-1972 శుక్రవారం మొదలు**
**25-5-1972 గురువారం వరకు**

**మేషం:** మీకు ముఖ్యమైనదని భావించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధించగలరు. వృత్తిలో ఆదాయం బాగుంటుంది. మిత్రుల సహాయం లభిస్తుంది. పోటీవారితో వాదప్రతివాదాలు తగవు. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి.

స్త్రీలకు—నూతన విషయాలను తెల్సుకొంటారు. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**వృషభం:** మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగించగలదు. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్యలో వృత్తి వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి. ప్రయాణాలు ఫలించగలవు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. దైవ కార్యాలు నెరవేరతాయి.

**మిధునం** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. వారంమధ్యలో అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు.

స్త్రీలకు—వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**కర్కాటకం:** అన్ని వ్యవహారాల్లోను మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు. ప్రయాణాలోచనలు చేస్తారు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**సింహం:** వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాంఘిక కార్యక్రమాలు బాగుంటాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. విలాస వస్తువులు కొంటారు.

**కన్య** చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారంమధ్యలో వృత్తివ్యాపారాలు బాగుంటాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు.

**తుల:** రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. వారం మధ్యలో వ్యతిరేక పరిస్థితి యేర్పడుతుంది. ఉద్యోగంలో మెప్పుకు రాని కార్యభారాన్ని వహిస్తారు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**వృశ్చికం:** అన్ని వ్యవహారాల్లోను గౌరవం లభిస్తుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

**ధనుస్సు:** వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి వస్తుంది. వ్యాపారంలో ప్రయోజనంగల సంభాషణలను జరుపగలరు. నూతన వ్యవహారాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు—వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. పుణ్యకార్యాలు చేస్తారు.

**మకరం** ప్రయాణం వలన ప్రయోజనం వరకు కలిగే సుఖం ప్రయాణాలు వాయిదా పడతాయి. వ్యతిరేకమైన వార్తలను వింటారు. వారంమధ్యలో వృత్తి వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి. విద్యావైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**కుంభం:** వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది.

**మీనం:** ఏ వ్యవహారంలోను ఇతరుల మీద ఆధారపడడం తగదు. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. మీ ఆలోచనలు లాభదాయకంగా ఉంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. పోటీవారితో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. దైవ కార్యాలు నెరవేరతాయి.

—మహేష్



# ఏటేటా వచ్చే దురద

## దానికి నివారణ ఏమిటి?



చెమటకాయలతో దురద, దురదని ఎంతో చికాకు పడతారు. గోకితే చర్మము పొరలు తేరి అసహ్యముగా ఉంటుంది. జాన్సన్స్ ప్రిక్లీ హీట్ సబ్బు మరియు ప్రిక్లీ హీట్ పౌడరు ఎండ వేడిలో చెమట కాయలు రాకుండా త్వరగా రక్షణ కలిగిస్తాయి అవి రెండూ చెమటకాయలనుండి రక్షణ విచ్చుటకు నేడు లభిస్తున్న తయారులలో ఎంతో పొదుపైనవి.

మొదట, ఔషధములు చేరిన జాన్సన్స్



ప్రిక్లీ హీట్ సబ్బుతో స్నానము చేయండి. అది వాచిన చర్మ రంధ్రములకు ఉపశమనము కలిగించి, అంటురోగములను సోకనీయదు.

తరువాత, చెమ్మను పీల్చి చర్మమునకు హాయిని కలిగించే జాన్సన్స్ ప్రిక్లీ హీట్ పౌడరును ఒంటిమీద జల్లుకోండి. దానిలో చెమటకాయలనుండి రక్షణనిచ్చే ఒక ప్రత్యేకమైన ఆంటిసెప్టిక్ పదార్థముంది. దానితో వెంటనే గుణము కనిపిస్తుంది. చెమటకాయల బాధనుండి తప్పించుకొనే పద్ధతి ఇదే.




**జాన్సన్స్***
**ప్రిక్లీ హీట్**
**పౌడరు మరియు సబ్బు**




జాన్సన్ అండ్ జాన్సన్ లిమిటెడ్ *ట్రేడ్ మార్క్




**జ రి గి న క థ**

మాధవరావు ఆ వూళ్ళోకి స్కూలుమాస్టారిగా వచ్చాడు. ఎవరికో ఉపకారం చెయ్యపోతే అతను కుక్కకాటుకు గురి అయ్యాడు. శామ్మగారు అతన్ని యింటికి తీసుకువచ్చింది. అనురాధ తొలి చూపుల్లోనే అతన్ని ఆకర్షించింది. ఆమె తండ్రి అభిప్రాయం ప్రకారం అతను ఆ యింట్లోనే వుండిపోవలసి వచ్చింది. ఆ రోజున తూలుతూ వచ్చాడు మాధవరావు. అతనుకూడా తన తండ్రిలాగా తాగుబోతు అయినందుకు విచారించింది అనురాధ. అతనికి హితబోధ చేసింది. మాధవరావు తప్పు తెలుసుకున్నాడు. ఆతర్వాత అనురాధ అతనికి మరింత చేరువై పోయింది. ఆ తర్వాత అతనిదగ్గర చదువుకోవడం ఆరంభించింది. రంగరాజు కొడుకు రాజారావు ఊరికి ప్రెసిడెంటుగా నెగ్గాడని ఆమె చాలా బాధపడింది. మాధవికి పెళ్లయి అత్తవారింటికి వెళ్ళిపోయింది. రాజారావు రాధని నిర్బంధించాడు. మాధవరావుకు సంబంధించిన ఒక రహస్యాన్ని వెల్లడించాడు.

---

## 13

మనస్సులో లక్ష ప్రశ్నలుదయించాయి. ఏదో బాధ కలయదిప్పినా రాజారావు వంటి మోసగానికి మాత్రం నా మనసివ్వలేదని నాకు ధైర్యం కల్గింది. అతని పూర్వగాధ విషాదభరితమని-అతడే చెప్పాడు. కాని, తనకు గతంలో జరిగినట్లు ఎప్పుడూ చెప్పలేదు. ఆఖరికి వేణుగోపాల్ కూడ ఎటువంటి సూచన చేయలేదు. ఆ అమ్మాయిని పెళ్ళాడుదామని అతను అనుకొని ఉండవచ్చు. కాని, పెళ్ళాడి మోసం చేశాడంటే ఎలా నమ్మను ?

ఆ ఫోటోకూడ బల్లమీద పెట్టేస్తూ, 'అతడెటువంటివాడయినా నేను నమ్మాను. పాపపుణ్యాల ఫలితం అతడే అనుభవిస్తాడు.' అన్నాను.

'అదే నీ తప్పు. ఒక పెళ్ళి జరిగిందతనికి. భార్యాబిడ్డలున్నారు. రేపు మీ పెళ్ళి జరిగాక ఆ అమ్మాయి కోర్టుకెక్కితే?...'

'ఆ అమ్మాయిమీద నీకంత దయవుంటే ఏడాదినుంచి అతడిక్కడున్నాడని చెప్పక పోయావా?'

'ఆ అమ్మాయికి తెలుసు. వాళ్ళు మాకు దగ్గర బంధువులుకూడా...'

'మరి ఏడాదినుంచి భర్తను వదలి ఎక్కడుంటోంది?...ఇన్నాళ్ళు అక్కర్లేని భర్త ఇంకొక అమ్మాయిని చేసుకుంటుంటే కావల్సివస్తుందా?...ఏదో దెబ్బకొట్టి నన్ను లొంగదీయాలని ఎందుకు ప్రయత్నిస్తావు నువ్వు? ఆ మాత్రం నిజానిజాలు గుర్తించలేని తెలివితక్కువ దాన్ననుకుంటున్నావా?' నా కంఠం ఆవేశపూరితమైంది.

'అయితే ఇక నీ ఖర్మ.'

నాకు నవ్వు వచ్చింది. 'అవును. ఎవరి ఖర్మకెవరు కర్తలు?'

'అయితే, నిన్నిప్పుడు నాశనంచేయాలంటే నాకు క్షణం పట్టదు తెలుసా?' అతను గర్జించాడు.

'తెలుసు.' నా కంఠం వణికింది. అప్పటికతని సామదానభేదోపాయాలు వీగిపోయాయి. ఇక ఆఖరిది దండోపాయంతో నన్ను లొంగదీసుకోవాలనుకుంటున్నాడు. పశువాంఛతో ఎదుట నిలబడివున్న ఆ కఠిన హృదయుడి నుండి ఇంకెలా తప్పించుకోగలను? ఎంతో పవిత్రంగా దాచుకున్న ఈ పుష్పాన్ని అమానుష హస్తాలపాలు చేయవల్సిందేనా భగవాన్!

'ఏం చెప్తావేం? ఏం నిర్ణయించుకున్నావ్?' రాజారావు కంఠంలోని కాఠిన్యం జరగబోయే దుష్క్రియను విప్పిచెప్పింది. ఆ పెద్ద భవనంలో మారుమూల గది లోంచి నేనఱచినా ప్రపంచానికి వినిపించదు. గవరయ్య, సత్తెమ్మ అంతా ఈ మోసంలో భాగస్తులు కనుక నన్ను కాపాడటానికి వస్తారన్న ఆశ నాకులేదు. అయితే, నా బ్రతుకింతటితో సరి!

'పోనీ, నన్ను చంపి నీ ఇష్టం వచ్చినట్టు చేసుకో!' అన్నాను రుద్ధకంఠంతో భరించలేని బాధతో నా చేతుల్లో ముఖాన్ని దాచుకున్నాను.

'ఛ! నిన్ను అనుభవించి ఆనందించాలి కాని చంపటమా!...నీ అందమైన శరీరాన్ని అక్కున చేర్చుకొని బ్రతుకెందుకు రాధా!...' రాజారావు మాటల్లో ఉద్రిక్తత నన్ను భయపెట్టింది. తలపైకెత్తి భయంగా చూసాను. అతనికళ్ళు జ్యోతుల్లా ఉన్నాయి. మరొక్కక్షణంలో లేడిపై కురికే సింహంలా- ఉన్నాడు. గబగబ మేడ కిటికీ దగ్గరికి పరిగెత్తాను. 'ఒక్క అడుగు ముందుకు వేసావంటే ... ఈ కిటికీ లోంచి క్రింద కురికేస్తాను.' అన్నాను ఎక్కడలేని ధైర్యం తెచ్చుకొని.

రాజారావు ముఖం నల్లగా మాడి పోయింది... 'అలాంటి పిచ్చిపని చేయకు

రాధా!' అని కేకపెడుతూ ఒక అడుగు ముందుకు వేసాడు అతను.

నేను మళ్ళా హెచ్చరించాను. 'దగ్గరకి రావద్దు. నేను ఇక్కడకు అడుగుపెట్టి నప్పుడే నా ప్రాణాలపై నాకాశపోయింది. కాని, డాక్టరుగారమ్మాయి... ప్రెసిడెంటుగారి అవరణలో ఎందుకు చచ్చిపడివుందో లోకం బాగా అర్థం చేసుకుంటుంది ... నీ క్షేమంకోసం చెప్తున్నాను...ఈ సంఘటన ఎవరికీ తెలియనివ్వను. నన్ను వదిలెయ్యి.'

వెలవెలబోతున్న అతని ముఖం చూసేసరికి నాలోని ధైర్యం పుంజుకున్నది. అతను వెనకడుగు వేసాడు. అప్పటికి చీకటి తెరలు లోకాన్ని కమ్ముకుంటున్నాయి.

'నన్ను బెదిరించి తప్పించుకోవాలనుకుంటున్నావు. కాని, ఇల్లలగ్గానే పండగయిందనుకోకు...మీ నాన్న తాగినప్పుడు చేసిన అప్పులింతవరకు తీరలేదు. ఆయన వ్రాసిన నోట్లు నా చేతుల్లో ఉన్నాయి. మీ పరువు గంగపాలు చెయ్యాలంటే క్షణం పట్టదు...ఏం చూసుకొని నీ నాన్న నిన్నా మాస్టారికిస్తాడో నేనూ చూస్తాను. పెద్ద సంసారంకదా ఆదుకోవచ్చని అనుకున్నాను. నా మాటలు నీకు తలకెక్కటంలేదు...'

అతని నోటికి అడ్డూ అదుపూ లేకుండా పోయింది. అందులోని నిజానిజాలను పట్టించుకొని బాధపడే శక్తి నాకు లేదు. అతని కిరాత హస్తాలనుండి తప్పించుకోవటమే నాకు ముఖ్యం!

నాకు మాటలు దొరకలేదు. అచేతనంగా కిటికీదగ్గరగా నిలబడిపోయాను.

'నువ్వు ఎంత తెలివైనదానివయినా ముందు చూపులేదు రాధా! ఇవాళ ఇక్కడికి వచ్చి ఇంతసేపు నాతో ఉండి నువ్వు వెళ్ళావంటే నీకెటువంటి పేరు వస్తుందో తెలుసా! ఈ రాజారావును కాలదన్నుకోకు — కష్టాలపాలుగాకు...' అతను మళ్ళీ హెచ్చరించాడు.

మోసానికి మోసమే చెయ్యాలనుకున్నాను. 'సరే, నన్ను ఆలోచించుకోనీ! ప్రస్తుతానికి నన్ను వదిలెయ్యి...నా అభిప్రాయం తర్వాత చెప్తాను...' అన్నాను ఎలాగో గొంతు పెగల్చుకొని.



అతని ముఖం వికసించింది. 'మంచి దానివి ఇలా దగ్గరగా రా!'

ఒక్కక్షణం సందేహించాను.

'నిన్ను నేను నమ్మినప్పుడు నన్ను నీవు నమ్మవా?'

ఏం చేయను. రెండడుగులు దగ్గరగా వేసాను...గోవు కసాయివాడిని నమ్మినట్లు.

అదిగో బల్లమీద ఆ సందుకాపెట్టెలో నెక్లేసు వుంది. అది మా అమ్మది. ఈ ఇంటి కోడలుకోసం ఇచ్చింది. నీవు నా దానివయినా కాకపోయినా ఒకసారి అది నీవు పెట్టుకుంటే నాకు తృప్తిగా వుంటుంది...' అన్నాడు రాజారావు.

నేను మూఢురాలినయ్యాను. ఏంచేయాలో తెలుపోలేదు.

'ఈ చిన్నకోరికకూడ తీర్చలేవా రాధా!'

తేసి మంచిమార్గాన్నే అతన్ని లొంగ దీసుకొని తప్పించుకుపోవచ్చుకదా! ఆడదాన్ని. బలప్రయోగంతో ఎలా తప్పించుకో గలను? ఇలా అనుకొని ఆ నెక్లేసు తీసుకొని మెడలోవేసుకొని బల్లమీద వున్న నిలువుటద్దంలో చూసుకొని సరిదిద్దుకున్నాను. ఓమూల గుండెల దడదడలతో ఈ నటన ఎలా చేయగలుగుతున్నానో నాకే అర్థంకాలేదు.

'ఇప్పుడు నువ్వెంత అందంగా ఉన్నావో తెలుసా!...ఈ అదృష్టాన్ని నాకు దక్కనివ్వవా రాధా!'

నా ఊహలు తల్లక్రిందులయ్యాయి. అతనిలో కనిపించిన క్షణికమయిన మంచితనం నిజమనుకొని మోసపోయాను. నేను కనుమూసి తెరిచేలోగా అతని కబంధ హస్తాలు నన్ను చుట్టేసాయి. ఐదు నిమిషాలక్రితం అతన్ని బెదిరించిన అనూరాధే దారుణంగా మోసపోయింది!

'...ఆడినమాట తప్పకు. నన్ను అవమానించకు. నాకు కొంత వ్యవధి ఇస్తే ఆలోచించి చెప్తాను...'

లేదు. నా కంఠశోష వృథా అయింది. అతన్ని నమ్మటం నా దురదృష్టం. వెర్రి తలలువేస్తున్న అతనిలోని కామజ్వాల నన్ను దహించబోతోంది. గతరాత్రి కన్న పీడకలకు ఇదే అర్థమేమో అనిపించి వణికిపోయాను. అది కల—కాని, ఇది నిజం!

'ఈ మధురక్షణాలు మరింకెప్పుడూ రావేమో రాధా! ఈ ఒక్కసారి నా మాట విను. తర్వాత నువ్వు ఏంచెప్పినా చేస్తాను...' అతని ఊర్పులజ్వాల నా చెంపల్ని కాల్చివేస్తోంది.

'...వద్దు వద్దు. నన్ను నాశనం చెయ్యకు. ముందు నన్ను చంపి నీ కోరిక తీర్చుకో...' బొంగురుపోయిన గొంతుకతో అరిచాను నేను.

'లేదు రాధా! ఈ ఒక్కసారి నా కోరిక తీర్చు...ఆ తర్వాత నేనేమైపోయినా ఫర్వా లేదు...నేను నీకు బానిసనవుతాను... నా రాణీ!...నా రాధా!...' అప్పటి అతని ప్రణయాలాపన నన్ను దగ్ధంచేస్తున్నట్లుంది.. స్పృహ కోల్పోతున్న నా శరీరాన్ని మంచంవైపు లాక్కుపోయాడతను.

నాలోని బలాన్నంతా వెచ్చించి గింజుకున్నాను. అతన్ని కరిచి ముక్కలుచేసి చంపాలనుకున్నాను. కాని, యుగయుగాలుగా అమానుషపురుషహస్తాలలో బలియైపోయిన అబలలకు ప్రతినిధిని నేను. ఒక రాక్షసుని పశుబలాన్ని జయించగల శారీరక బలం నాకెక్కడిది?

భగవాన్! అంతా సర్వనాశనమైపోతోంది. ఈ అవమానాన్ని భరించటానికి ముందే నా ప్రాణాలు తీసుకుపో ప్రభూ! లేకపోతే, ఏ అద్భుతశక్తి అయినా వచ్చి ఈ రాక్షసునినుండ నన్ను రక్షించేలా చెయ్యి... పురాణకాలంలో ద్రౌపదిమొర మాధవుడు విన్నాడు. ఆమెను ఆ పరాభవంనుండి రక్షించాడు. కాని, ఈ పాప పంకిలమయిన కలియుగంలో అబలకు అంత అదృష్టమా?

లేదు. నా ప్రతుకు బండలయి పోయింది. పెనుగులాటతో నేను నీరసించి పోయాను. నన్ను నిస్సత్తువ క్రమ్ముకుంది. స్పృహ తప్పేసట్లయింది. మరుక్షణంలో నాకేమయిందో తెలియదు. అలా ఎంతసేపు స్పృహ లేకుండా ఉన్నానో తెలియదు.

* * *

తెలివి వచ్చేసరికి నా ముఖంలోకి ఆదుర్దాగా చూస్తూ 'అతను' కనిపించాడు. నా ముఖంపై అతను నీళ్లు జల్లుతున్నాడు. ఒంటినిండా గాయాలతో నలిగిన బట్టలతో అతను పిచ్చివాడిలా ఉన్నాడు. ఆ పరిస్థితిలో అక్కడ అతనలా ప్రత్యక్షమయ్యేసరికి నాకు మతి చలించినట్లయింది.

సర్వనాశనమైపోయాననుకున్న క్షణంలో స్పృహనుండి మేల్కొల్పిన వ్యక్తి మనోహరుడు కావటం నా కత్యాశ్చర్యం కల్గించింది. రాజారావు చేతుల్లోంచి తను గట్టెంచాడని గ్రహించటానికి క్షణం పట్టలేదు.

అతని ముఖంలోని చిరునవ్వు నాలో చైతన్యాన్ని కల్గించింది. భగవంతుడు నా ప్రార్థన నాలకించాడన్నమాట! నా అవమా

పత్రికలో కొద్దొస్తున్న పడాలని—




శ్యామసుందర్

# గులాబి పూగుత్తిని ప్రతి రోజూ మీ కుటుంబమునకు మీ రెట్లా




# ఇవ్వగలరు? క్రొత్త బినాకా రోజ్ టాల్క్ తో



గులాబి పూవుల క్రొంగ్రొత్త వాసనలను బినాకా పట్టి ఉంచారు. చర్మమును లాలించే అద్భుతమైన సరిక్రొత్త మెత్తదనం వాటికి జోడించారు. ఉల్లముల ఉల్లాస మూగించే చక్కదనాల సరిక్రొత్త ప్యాక్‌లో వాటిని నింపి ఉంచారు. ప్రతి రోజూ మీ కుటుంబమునకు బహూకరించుటకై ఒక గులాబి పూవుల గుత్తి!

గులాబి పూవులు మీ కుటుంబమునకు కూర్చి నింపకపోతే, క్రొత్త శాండల్‌వుడ్ టాల్క్ యొక్క మృదుల పరిమళంతో ప్రాచీన వైభోగం పునరుద్ధరించండి.

**బినాకా**

ఇంటిల్లిపాదికి ఇష్టమైన టాల్క్

దానికి వత్తావగ్గాలు లేకపోయాయి.

ఆర్ణవమైన ఆనందం పొంగి పొరలి నన్ను ముంచెత్తి తట్టుకోనివ్వలేకుండా చేసింది. ఒక్క ఉదుటున పైకిలేచి అతన్ని బిగియార కౌగలించుకున్నాను. 'మాస్టారూ! ...' నా పెదవులు కంపించాయి. నాకు దుఃఖం పొంగివచ్చింది.

'ఊరుకో రాధా! ఊరుకో ... ఇక్కడ నుంచి మనం త్వరగా వెళ్ళిపోవాలి...' అన్నాడతను బుజ్జగిస్తూ.

అప్పటికి తేరుకున్నాను. 'ఏం జరిగింది? రాజారావు ఏడీ?'

'అదిగో...కుర్చీలో...'

అటువైపు తిరిగి తెల్లబోయాను. పెడ రెక్కలు విరిచి కట్టబడి వున్నాడు రాజారావు. అతని నోట్లో గుడ్డలు కుక్కి ఉన్నాయి. అతని ముఖంమీదకూడ గాయాలు కొట్టవచ్చినట్లు కనపడ్డాయి. రాజారావు ఎదురుగా అతని కౌగిట్లో ఉన్నాను నేను. నాకంత బాధలోకూడా నవ్వు తెప్పించింది.

ఇద్దరం పైకి లేచాము. నా ఒళ్ళంతా నొప్పులుగా ఉంది. జాకెట్ అక్కడక్కడ చిరిగి ఉండటం గుర్తించి సిగ్గుపడిపోయాను. నలిగిన చీర చెంగును ఒళ్ళంతా కప్పుకున్నాను.

అతను రాజారావు దగ్గరగావచ్చి, 'మీమీద నాకు పగలేదు. ఒక ఆడపిల్లకు మీరు చేస్తున్న అన్యాయాన్ని చూసి సహించలేక చేయి చేసుకోవాల్సి వచ్చింది. అందుకు నాకెంతయినా బాధగా ఉంది. మీరు నన్నావేళ పిలిచి హెచ్చరించారు. అనూరాధను నేను బలవంతంగా నా స్వంతం చేసుకోవాలని

# రాగధార

నేనెప్పుడూ ప్రయత్నించలేదు. మీదారికి నేనెప్పుడూ అడ్డు రాను. మీరు మీ పెద్దల ద్వారా ప్రయత్నించి ఆమెను చేపట్టటం సబబు...అపైన మీ ఇష్టం... శలవు. మీ పనిమనిషి వచ్చేవరకు మీరిస్థితిలో ఉండి వెళ్ళక తప్పలేదు నాకు. మరేమను కోకండి.' అన్నాడు.

'...ఇక పోదాం పద రాధా!...' అని అతడు నా చెయ్యి పట్టుకున్నాడు.

అప్పుడే నా మెడలోని నెక్లెసు గుర్తుకు వచ్చింది. 'ఒక్క నిమిషం ఉండండి...మీ అమ్మగారి కోరిక ప్రకారం ఈ ఇంటి కోడలుకోసం ఈ హారాన్నిక్కడే వదలి వెడుతున్నాను...' అని రాజారావువైపు చూపించి ఆ నెక్లెసును బల్లమీద వుంచి అతన్ననుసరించాను రాజారావు కళ్ళల్లోంచి కురుస్తున్న విస్ఫులింగాలు నన్నేమీ చేయలేక పోయాయి.

నాకు గాలిలో తేలిపోతున్నట్లుగా వుంది. దైవప్రార్థన క్షణంలో ఫలించటం పుస్తకాల్లోనే చదివాను ఇంతవరకు. కాని, నిజ జీవితంలో కూడ అది నిజమైంది. ఆ సమయంలో అతనక్కడకు ఎలా వచ్చాడో నాకు తెలియదు.

మేడ మెట్లు దిగి క్రిందకు వచ్చిన వెంటనే అక్కడ ఎదురైన సత్తెమ్మతో అతను అన్నాడు. 'మీ దొరగారి కట్లు విప్పెయ్యి! ఈ విషయం ఎవరికీ తెలియటం మంచిది కాదు. తెలిసినా నాకేం బాధలేదు. నేనెప్పుడయినా ఈ ఊరు వదలి వెళ్ళటానికి సిద్ధమే! కాని, ఇద్దరి తండ్రులూ ఊళ్ళో లేని సమయంలో ఇలా డాక్టరుగారి అమ్మాయిని మోసం చేసారని నలుగురికీ తెలిస్తే మీ అందరికీ తలవొంపు. ఇంటి గుట్టు రచ్చకీడ్చకండి ... మేము వెళ్ళాక గవరయ్య కట్లు కూడ విప్పెయ్య...'

'...మంచిదయ్యా! నీది బలే దొడ్డ మనసు...'

'నాకు నీ పొగడ్తలక్కర్లేదు కాని— నీవు ఆడదానివి కనుక మరొక ఆడపిల్ల మాన మర్యాదలకు భంగం రాకుండా చూడ వల్సిన కనీస ధర్మం నీకుందని గుర్తుంచుకో! ఈవేళ చేసిన తప్పు పనికి దేవుడు కూడ క్షమించడు నిన్ను. ఇటువంటిది ఇంకెప్పుడూ చేయకు. ఆడవాళ్లను ఆడవాళ్ళే మోసం చేసినప్పుడు ఏ మగవాడూ రక్షించలేడు. జాగ్రత్త!'

'అమ్మో!...అమ్మో!...బుద్ధి గడ్డి తిని' సత్తెమ్మ మొసలి కన్నీరు కార్చింది.

చీకట్లో అడ్డదారిని మా యింటికి చేరుకున్నాము.

ఇంటికి వచ్చిన వెంటనే బట్టలు మార్చుకొని రేగిన జుట్టును గబ గబ దువ్వుకున్నాను.

అతని గాయాలకు శుశ్రూష చేస్తూ, '...నాకోసం మీరింత ప్రమాదాన్ని కొని తెచ్చుకున్నారు.' అన్నాను.

అతని ముఖంలో మాయని మందహాసం! నాకు దుఃఖం ఆగలేదు. 'మాస్టారూ!...' అని అతని చేతిని మొత్తేసి వెక్కి వెక్కి ఏడ్చేసాను. అతను నన్నోదార్చలేదు. అతనికి తెలుసు...నా గుండెల బరువు దిగిపోయే వరకు నాకు దుఃఖం ఆగదని! అతని అభయ హస్తం నా వెన్ను నిమురుతూ ఓదార్పు నిచ్చింది.

కొంత సేపటికి తేరుకున్నాను. అతని గాయాలకు మందురాసి కట్లు కట్టాను.

'మీరక్కడికెలా రాగలిగారు?...'

'భగవంతుడు నాకు తోపించాడు...సమయానికి రాగలిగాను.'

'నేను మళ్ళీ మిమ్మల్ని చూస్తానని అనుకోలేదు. నిన్నరాత్రి పీడకల రావటం ...ఇప్పుడిలా జరగటం...అంతా ఆశ్చర్యంగా వుంది.'

'లేదు అనూ! నీకు దేవుడుకూడ అపకారం చేయలేదు...జరిగింది చెప్తాను విను. ఆవేళ స్కూల్లో వీణకచేరీ జరిగి నప్పటినుంచి రాజారావు నామీదొక కన్ను

సినిమా కార్టూన్ — బాలి



# పంచగంగలు



బులుసు వేంకటరమణయ్య: ధర్మపథం

ఏ పూజ అయినా చేసే ముందు కలశంలో నీరుపోసి, ఆ కలశాన్ని గంధ పుష్పాక్షతలతో పూజించి, అందులోని ఉదకం సప్తనదుల నుంచి వచ్చిన దానినిగా భావించవలసి ఉంటుంది. ఆ నదులు — గంగ, యమున, గోదావరి, సరస్వతి, నర్మద, సింధువు, కావేరి అనే సప్తనదులని

'గంగే చ యమునే చైవ
గోదావరి సరస్వతి,
నర్మదే సింధు కావేరి
జలేఽస్మిన్ సన్నిధిం కురు'

అనే శ్లోకం వల్ల తెలుస్తున్నది. వీటిలో గంగానది ఉత్తమోత్తమయిన నదని అందరూ అంగీకరిస్తారు...గంగాజలం ఎన్నాళ్ళయినా నిలవ ఉండగలదనే విషయం అందరూ ఎరిగినదే! తక్కిన నదులు కూడా పవిత్రములైనవే! అందువల్లనే వాటన్నిటి జలమూ కలశంలో ఉన్నట్లు భావిస్తూ ఉండవలెనని అభిప్రాయం.

అయితే, ఈ సప్తనదులూ కాకుండా ప్రసిద్ధంగా పంచగంగలు ఉన్నవి. అవి అయిదున్నూ నదులే! గంగానదికి ఎంత పవిత్రత ఉన్నదో ఇతర నదులు కొన్నింటికిన్ని అంత పవిత్రత ఉన్నందున అవిన్ని గంగానదులే అని పేరు పొందాయి.

పంచగంగలూ ఏవంటే—

'కావేరీ తుంగభద్రా చ
కృష్ణవేణీ చ గౌతమీ,
భాగీరథీ చ విఖ్యాతాః
పంచగంగాః ప్రకీర్తితాః'

కావేరి, తుంగభద్ర, కృష్ణానది, గోదావరి, గంగానది — ఈ అయిదూ పంచగంగలని ప్రసిద్ధములైనవని దీని తాత్పర్యం. సప్తనదులలో దక్షిణదేశంలోని కావేరీ, గోదావరులు మాత్రమే చేర్చబడినవి.

ప్రాచీన కాలంలో దాక్షిణాత్యులు కాశీకి పోయి గంగలో స్నానం చెయ్యడం అసాధ్యమై ఉండేది. 'కాశీకి పోయినవాడు, కాటికి వెళ్ళినవాడు సమం' అనే నానుడి కూడా ఏర్పడింది. కాశీకి వెళ్ళినవాడు తిరిగి వచ్చి కంటపడే దాకా బ్రతికి వున్నాడనే నమ్మకం లేక పోయేది. అందువల్లనే మన వాళ్ళు దక్షిణదేశంలోని ముఖ్యనదులను పేర్కొని, అవి గంగానదితో సమానాలని, వాటిలో స్నానం చేస్తే గంగానదిలో స్నానం చేసిన ఫలం లభిస్తుందని ప్రజలకు నచ్చజెప్పడం కోసం ఈ విధంగా పంచగంగలనూ ఏర్పరచి ఉండవచ్చును.

బమ్మెరపోతన్నగారు గ్రహణ సమయంలో గోదావరికి వెళ్ళినా — ఆ నదిని 'గంగ' అనే పేర్కొన్నాడు. ఈ విషయం భాగవతాన్ని బట్టి తెలుసుకోవచ్చును. ●

## రాగధార

వేసి ఉంచాడు. వారంరోజులనాడు ఊరి బయట హఠాత్తుగా కలిసాడు. నన్ను బెదిరించాడు. నీతో అతని పెళ్ళి జరగబోతోందని ఆశలు పెట్టుకోవద్దని హెచ్చరించాడు. నేనెంతకీ లొంగక్కపోవటం చూసి తనవద్ద ఉన్న ఫోటోలు చూపించి నా గత చరిత్రను అందరికీ చాటి చెపుతానన్నాడు. అతని ఇష్టం వచ్చినట్లు చేసుకోమన్నాను. ఒకరి ప్రయత్నాలను మరెవ్వరూ ఆపలేరని, నాగత చరిత్రనుబట్టి నన్ను హీనంగా చూసేవాళ్లతో నేనెటువంటి సంబంధాలు ఏర్పరుచుకో బోవటం లేదని చెప్పాను.

'ఏదో ఒకనాడు నా చరిత్ర నీకు, మీ నాన్నగార్కి ఎలానూ తెలుస్తుంది. అప్పుడు కూడ మీ మనస్సులు మారవని నాకు తెలుసు. అందువల్ల అతని బెదిరింపులకు నేను జంకలేదు — ఈవేళనే వేణునుంచి ఉత్తరం వచ్చింది. ఆపరేషన్ సుళువుగా జరిగిందని... వారం రోజుల్లో మీ నాన్నగారు, బామ్మగారు తిరిగి వస్తారని నిన్ను ధైర్యంగా ఉండమని చెప్పమని అతను వ్రాసాడు. ఈవేళ రేపట్లో మీ నాన్నగారు నీకు వ్రాస్తారనికూడా వ్రాసాడు...

'నీకా శుభవార్త చెబుదామని ఇంటికి వచ్చేసరికి నీవులేవు. పిల్లలనడిగితే మీ పిన్నిగార్కి నువ్వు వ్రాసి ఇచ్చిన కాగితం పట్టుకు వచ్చారు. అది చూసేసరికి నా ఆలోచనలు పరిపరివిధాల పోయాయి. మధ్యాహ్నం రంగరాజుగారింకా ఊరినించి రాలేదని ఎవరితోనో హెడ్మాస్టారనటం విన్నాను. కాని, ఏదో కబురు తెల్పిందని నువ్వు రంగరాజుగారింటికి వెడుతున్నానని వ్రాసావు. ఎప్పుడూ అక్కడ అడుగు పెట్టని దానిని వెడుతున్నావంటే ఏదో బలమైన నమ్మకం కుదిరేలా చెప్పి ఎవరో నిన్ను అక్కడకు తీసుకువెళ్లారని గ్రహించాను. దానితో నా అనుమానం నిజమైంది...

'గుమ్మంలో బాణాకర్రతో అటకాయించాడు గవరయ్య. నా మంచిమాటలు విన్నాడు కాదు. నాపైకి దౌర్జన్యానికి దిగాడు. బడిపంతులు మాధవరావు మాత్రమే వాళ్లకి తెలను. ఒకనాడు కసరత్తుచేసిన మాధవరావు ఎవ్వరికీ ఇంత వరకు ఎదురు పడలేదు...' అని నవ్వాడు అతను.

'...నా తొందరపాటే ఇంత తెచ్చింది. నేడు మరోగంట ఆగివుంటే మీరీ శుభవార్త చెప్పివుండేవారు. మన అందరికీ ఈ ప్రమాదాలు తప్పి ఉండేవి...'

'ఏ ప్రమాదాలు కూడా చెప్పిరావు. కాని, సాధ్యమైనంత వరకు ఆలోచించి ఏపని అయినా చెయ్యాలి.'

'అబ్బ, గంటక్రితం నేనున్న పరిస్థితి తలుచుకుంటే నాకిప్పటికీ భయంవేస్తోంది.'

అతను నా వెన్నుచుట్టూ చేతులువేసి బుజ్జగిస్తూ అన్నాడు. 'ఏం భయంలేదు అనూ! మన ప్రేమ నిష్కల్మషమైనది. ఈ పూజాఫలాన్ని పవిత్రంగా ఉంచటమే భగవన్నిర్ణయం. అందుకనే నిన్ను తిరిగి దక్కించుకున్నాను.'

సర్వ ప్రపంచాన్ని మరచి హాయిగా కళ్ళు మూసుకున్నాను. అనురాగం అంబరమై ఆనలదంల అర్ణవమైంది.

(ఇంకా ఉంది)




# జమ్మివారి లివర్ క్యూర్

—పరిశోధించి, వాడి ఋజువు చేయబడింది.

మన దేశంలో పిల్లలకు ప్రాణహానికరమైన జబ్బులలో లివరు జబ్బు ముఖ్యమైనది.

కామెరలు, లివరు పెరగటం మొదలైన లివరు జబ్బులన్నిటికీ జమ్మివారి 'లివర్‌క్యూర్' మేలైన ఔషధమని ఋజువు చేయబడింది.

తుత్తునాగము, ఇనుము, బోరాన్, కాల్షియం మొదలైన లోహాల ధాతువులు చేర్చబడిన జమ్మిన 'లివర్‌క్యూర్' శాస్త్రప్రకారం తయారైన ఆయుర్వేద ఔషధము.

ఇది జ్వరనివారిణి. జారీ మూత్రవిసర్జనకు సహకరిస్తుంది. పిల్లల లివరు జబ్బులకు జమ్మివారి 'లివర్‌క్యూర్' బాగా జబ్బులను కుదిర్చి లివరుకు బలాన్ని కలిగిస్తుంది.

పిల్లల లివరు సంబంధమైన రోగాలకు జమ్మివారి 'లివర్‌క్యూర్' అమోఘమైనదని భారతదేశంలో మంచి అనుభవజ్ఞులైన వైద్యులందరూ అంగీకరించారు.

జమ్మివారి 'లివర్‌క్యూర్' పిల్లల లివరు రోగాలకు వాటివాటి ప్రత్యేక లక్షణాలు, పరిణామాలు, పరిస్థితులనుబట్టి మూడు రకాలుగా లభిస్తుంది.

**జమ్మివారి 'లివర్‌క్యూర్' —**
**70 సంవత్సరాలుగా నమ్మకమైన ఔషధము**

జమ్మి వెంకటరమణయ్య అండ్ సన్స్, మద్రాసు-4
తయారుచేయువారు: జమ్మి ఫార్మసూటికల్స్, మద్రాసు-26.




**రాధ :**

జీవితం ఎంత బాగుంది! ఆయనకి నేనంటే ఎందుకంత ప్రేమ? నేనేం చేస్తున్నాను ఆయనకోసం? విజయే ఆ రోజు అడిగింది 'ఏమిటే? మీ ఆయన నిన్ను అలా తిడుతుంటే పడి ఊరుకుంటావు? నువ్వు చేసిన మహాపరాధం ఏమిటీట? న్యూస్ పేపర్లు సర్ది రేక్‌లో పెట్టకపోతే కూడా కోపమేనా?' అని. నేను చిరునవ్వు నవ్వుతుంటే విజయ ఆశ్చర్యంగా చూడ్డం నాకేసి. దానికెలా అర్థం అవుతుంది నా మనసు? ఆయన నా మీద కోప్పడితే నాకెంత జాలేస్తుందో, నా మీద నాకే ఎంత కోపం వస్తుందో — ఆయనకి కోపం వచ్చే పనులే ఎప్పుడూ చేస్తానని.

ఒకరోజు ఎంత ఏడిచానో! ఆ రోజు వంటగదిలో గాస్ స్టవ్ మీద నేను కూర చేస్తుంటే ఆయన వచ్చి, నా చుట్టూ చేతులువేసి కదలనివ్వకపోడం, నేను కూర మాడిపోతుందని చెప్పినా. 'మాడిపోనీ వెధవ కూర, మళ్ళీ చెయ్యొచ్చు' అనడం. 'ఊఁ! మీకేం! మళ్ళీ కూర్చుని వండాల్సింది నేను. వదలండీ' అన్నా చిరాగ్గా. ఆయన నన్ను చప్పున వదిలి 'మరి కూర వండడం అయ్యేక డ్రయింగ్ రూమ్‌లోకి రా, నీకో వండర్‌ఫుల్ థింగ్ చూపెట్టాలి.' అని వెళ్ళిపోయారు వంటగదిలోంచి. హర్ట్ అయినట్టు అనిపించింది ఆయన. 'ఛీ! నాకు బుద్ధిలేదు' అనుకున్నాను. ఆయన అలా వంటగదిలోంచి వెళ్ళగానే ఎంత ఏడుపొచ్చిందో, ఆయనని ఎందుకు బాధపెట్టానని. ఆయన నా దేముడుకాదూ! నా ప్రాణంకాదూ! ఆయన లేకుండా నేనుండగలనా? బాబోయ్! అలా ఆలోచించడానికే భయమేస్తోంది. ఆరోజు కొంతసేపు పోయాక, డ్రాయింగ్‌రూమ్ సోఫాలో కూర్చున్నాక ఆయన నాకిష్టమైన పెయింటింగ్ ఎక్కడినుంచో తెచ్చి చూపిస్తుంటే ఏడుపు ఆగలేదు. ఆయన కళ్ళు ఇలా పెద్దవిచేసి చూస్తుంటే నాకేం మాట్లాడాలో తెలియలేదు. ఎందుకేడుస్తున్నావని ఆయన అడుగుతుంటే ఏం లేదు, ఏం లేదని కళ్ళు తుడిచేసుకున్నాను తొందరగా. ఆయన ముందు నేనేడవకూడదు. నేనేడిస్తే ఆయన మొహంమీద బాధ స్పష్టంగా కనబడుతుంది నాకు. నేనేడిస్తే సహించలేరు

ఆయన. ఆయన అలా బాధపడుతుంటే నా మనసంతా కలచినట్టు ఉంటుంది. ఆయన నాకోసం అంత పరితపిస్తారు. నేనంటే అంత ప్రేమగా ఉంటారు. నేనే ఫూలిష్‌గా, కర్ట్‌గా మాట్లాడి ఆయన్ని బాధ పెడుతూ ఉంటాను. నామీద నాకు ఎంత కోపం వస్తుందో.

ఆయన నన్ను తిట్టకూడదూ నేను చిరాకు పడ్డప్పుడు. అబ్బ! ఆయన నన్ను తిడితే ఎంత బావుంటుంది? ఇలా ఆలోచిస్తుంటే నా మనసు ఎంత తేలికగా ఉందో. ఎప్పుడేనా ఒకసారి అడుగుతాను నన్ను తిట్టమని. కాని ఎలా అడగాలి? నవ్వుతారేమో! ఆయన అలా నిర్మలంగా నవ్వుతుంటే నాకెంత బావుంటుందో!

నేను ఆయనకోసం ఏదైనా చెయ్యాలి. ఆయన్ని ఒక్క క్షణంకూడా విచారంగా ఉండకుండా చెయ్యాలి. ఆయన కాళ్లకి నమస్కారం పెట్టాలని ఉంటుంది నాకు. ఒకసారి ఆయన పాదాలు ముట్టుకుంటాను, ఎబ్బెట్టుగా ఉంటుందేమో! మరీ సినిమాల్లోలాగా. ఆవేళ ఆయన నా పాదాల మీద తడిగుడ్డతో రాయలేదూ—నాకు వంట్లో వేడిగా, గుబులుగా ఉంటే. నాకెలా అనిపించిందో ఆ రోజు—కోపం వచ్చింది నాకు. ఏమిటిలాంటి పనులు చేస్తారు ఈయన అని. బాధనిపించింది ఆయనచేత అలా చేయించుకుంటున్నానని. నేను తన పాదాలకి నమస్కారం పెడితే ఆయనకి బాధనిపిస్తుందేమో, కోపం వస్తుందేమో! అలా చెయ్యను. నాకు పిచ్చి! ఏమిటో ఈ ఆలోచనలు! అసలిలా ఎవరైనా ఆలోచిస్తారా? ఏమో! ఏమిటో చెయ్యడం లేదనిపిస్తోంది ఆయన కోసం. ఆయనకి నేనంటే ఎంత ఇష్టం! ఎంత ప్రేమ! నాకుకూడా ఆయనంటే అంతే ప్రేమని, ఇష్టమని ఆయనకు తెలుసా?

ఒకసారి నాకు వరసగా నాలుగు రోజులు జ్వరం తగ్గకుండా ఉంటే ఆయన సాయంత్రం ఆఫీసునుంచి వచ్చి, నా దగ్గరగా కూర్చుని, అలా చూసేరు నా కళ్లల్లోకి. 'ఏమిటిది రాధా! నీకు జ్వరంగా ఉంటే నేనాఫీసుకి వెళ్లడం! ఎలా ఉందిప్పుడు' అని నా తలమీద చెయ్యేస్తే నాకు నవ్వొచ్చింది. 'జ్వరానికే ఆఫీసు మానెయ్యాలా! మీకు పిచ్చి' అని నేనంగానే హఠాత్తుగా లేచి వెళ్లిపోయా రక్కడ్నుంచి. ఆయన కళ్లు ఎంత తడిగా ఉన్నాయో! నాకోసం ఎంత ఫీలవుతారో ఆయన. ఆయన ఆప్యాయతకీ, ప్రేమకి నేను తగ



# తల నొప్పా?

# అనాసిన్

## నొప్పి నివారణకు మేలైనది. ఎందువలనంటే అది బలీయమైనది మరియు సురక్షితమైనది.



ఒలింపియన్ ఫుట్ బాల్ ఆటగాడు నెవిల్ డిసౌజా అనాసిన్ వాడకందారు. 'నేను ఎల్లప్పుడూ అనాసిన్ దగ్గర ఉంచుకుంటాను', అని అతను అంటాడు.

***బలీయమైనది*** ఎందువలనంటే ప్రపంచమంతటా ఎక్కువ మంది డాక్టర్లు సిఫారసు జేసే బాధా నివారక పదార్థాలు అనాసిన్ ఎక్కువగా కలిగియున్నది. అందువలననే అనాసిన్ బాధనుంచి సత్వర నివారణ కలిగిస్తుంది.

***సురక్షితమైనది.*** ..ఎందువలనంటే అనాసిన్ డాక్టరు ఇచ్చే మందుల మిశ్రమం వంటిది. మీరు దానిని సురక్షితంగా పిల్లలకు కూడా ఇవ్వవచ్చును. అన్ని మందుల విషయంలో వలె, మీ పిల్లలకు దీని సరియైన మోతాదు కోసం మీ డాక్టరును సంప్రతించండి.

జలుబు మరియు ఫ్లూ వలన కలుగు నొప్పులకు, తలనొప్పి,
నడుం నొప్పి, కండరాల నొప్పులకు మరియు పంటి నొప్పికి బాగా పనిచేస్తుంది.

**అనాసిన్**

**భారతదేశపు ఎక్కువ జనప్రియమైన నొప్పి నివారిణి**




Regd. User of TM., Geoffrey Manners & Co. Ltd.

# పళ్ళు - గుణాలు

## అరటిపండు

అరటిపళ్ళలో చాలా రకాలున్నాయి. మొత్తం మీద అన్ని రకాల అరటిపళ్ళకూ కలిపి కొన్ని సామాన్యమైన గుణాలున్నాయి.

అరటిపండు వేడిచేసి నీరు పెంచుతుంది. మంచి బలాన్ని చేకూర్చి వీర్యపుష్టినిస్తుంది. కొంచెం ఆలస్యంగా జీర్ణమవుతుంది. రక్తాన్ని కాస్త చిక్కబరుస్తుంది హృదయానికి పొట్టకు మృదుత్వాన్ని యిస్తుంది. కిడ్నీస్‌కు సత్తువ నిస్తుంది. ఆకలి దప్పికలను, వేడిని పైత్యాన్ని, పొడిదగ్గును అణచి వేస్తుంది. గొంతుకను శుభ్రపరుస్తుంది. వేడితత్వం గలవారికి పుంసత్వమును హెచ్చిస్తుంది.

పురాణ రక్తగ్రహణికలవారు బాగా పండిన శర్కరకేళి, అమృతపాణి, కర్పూరకేళి అరటి పళ్ళను మితంగా పుచ్చుకుంటే మేలుచేకూరుతుంది.

వాత శ్లేష్మతత్వాలుగలవారు— నేత్రరోగం గలవారు— బుద్ధి మాంద్యం, బూరగాలు గలవారు అరటిపళ్ళు అధికంగా తినకూడదు. రుచిగా ఉంటాయికదా అని అరటిపళ్ళు అధికంగా తింటే అజీర్ణం పెట్టుకోవచ్చు. మూత్రంలో సుద్ద హెచ్చవుతుంది. అరటి పళ్ళను పరగడుపున తిని నీళ్ళు త్రాగ కూడదు.

అరటిపళ్ళయొక్క దుర్గుణాలకు విరుగుళ్ళు:— 1. పంచదార 2. తేనె 3. ఏలకులు 4. మిరియాలపొడి 5. నెయ్యి 6. ఉప్పు 7. అల్లం 8. ఈ పండు యొక్క తొక్క.

## ఖర్జూరపు పళ్ళు

ఇవి తియ్యగా రుచిగా ఉంటాయి. శరీరానికి బలాన్ని యిస్తాయి. రక్తంలో ఉండే దోషాన్ని హరిస్తాయి. వాతాన్ని, పైత్యాన్ని హరిస్తాయి.

మూడు నాలుగు పళ్ళను మధ్యాహ్నం వేళ, నీళ్ళలో నానబెట్టి, రాత్రి నిద్రపోయేముందు చింతపండు గుజ్జులాగ పిసికి— ఆ గుజ్జును పుచ్చుకుంటే మంచివీర్యపుష్టి చేకూరుతుంది.

అధికంగా తింటే హృదయానికి, కళ్ళకు నష్టాన్ని కలుగజేస్తాయి.

ఖర్జూరపుకాయ వేడిచేసి, మేహశాంతి చేస్తుంది. బలాన్ని వీర్యపుష్టిని యిస్తుంది. పుంస్త్వాన్ని హెచ్చిస్తుంది. రక్తపైత్యం, పైత్యం, మూలవ్యాధి, అతిసారం, జ్వరం, తాపం, దాహం, వాతం, పాండురోగం, మూత్రఘాతం, శ్లేష్మం, ఉబ్బసం, దగ్గు, క్షయ, పక్షవాతం గలవారికిది మేలుచేస్తుంది. నడుము నొప్పి, ఎముకల నొప్పిగలవారు కొన్నాళ్ళ పాటు తింటే ఆయా నొప్పులు తగ్గుతాయి.

అధికంగా తింటే లివర్‌లోను, స్ప్లీన్‌లోను కంతులు పుడతాయి. కళ్ళకు, దంతాలకు నష్టం వాటిల్లుతుంది. ఈ పళ్ళ యొక్క దుర్గుణాలకు విరుగుళ్ళు:— 1. మంచినూనె, 2. నెయ్యి, 3. ఎండుమిరపకాయలు, 4. వేడి నీరు, 5. బాదంపప్పు, 6. గసగసాల చమురు 7. వేపవిత్తులు, 8. తుంగముస్తలచూర్ణం.

## కిసిమిసి పళ్ళు

ఇవి ద్రాక్షపళ్ళకంటే చిన్నవిగా ఉంటాయి. వీటిలో గింజలుండవు. ఎండు కిసిమిసి పళ్ళు త్రిదోషహరమైనవి. వీర్యవృద్ధి చేకూరుస్తాయి. మేహశాంతినిస్తాయి. శరీరానికి మంచి బలాన్ని యిస్తాయి. దగ్గును, మూలవ్యాధిని శమింపజేస్తాయి. చాలావరకూ ద్రాక్షపళ్ళ గుణాలనే కల్గి ఉంటాయి.

పచ్చి కిసిమిసి పళ్ళు మేహశాంతి నిస్తాయి. క్షయ రోగమున్న వారికివి మేలు చేస్తాయి.

అధికంగా తింటే విరేచనాలవుతాయి. పుళ్ళు ఉన్నట్లయితే అవి చీము పడతాయి. కళ్ళకు, పళ్ళకు హాని చేస్తాయి. వీనియొక్క దుర్గుణాలకు విరుగుళ్ళు:— 1. పుల్లనిపళ్ళు 2. పంచదార, 3. సికంజిబీను.

## రేగుపండు

రేగుపళ్ళలో గంగరేగుపళ్ళు, మామూలు రేగుపళ్ళు అని రకాలున్నాయి.

గంగరేగుపండు తియ్యగా, కొంచెం పుల్లగా, స్వాదుగా ఉంటుంది. వాతాన్ని పోగొడుతుంది. శ్లేష్మాన్ని వృద్ధి చేస్తుంది.

మామూలు రేగుపళ్ళు కాస్త పులుపుగా, రుచిగా, జిగటగా ఉంటాయి. ఇవి చలవచేసి ఆర్పుతాయి. వాతం, మేహం, మూలవ్యాధిగల వారికివి మేలు చేస్తాయి, శుభ్రమయిన రక్తాన్ని పుట్టిస్తాయి. శరీరానికి కాంతిని బలాన్ని యిస్తాయి.

ఇవి కాస్త ఆలస్యంగా జీర్ణమవుతాయి. విరేచన బద్ధం చేస్తాయి. గొంతుకను బొంగురు పరుస్తాయి. కఫాన్ని, పైత్యాన్ని హెచ్చిస్తాయి. మరీ పుల్లటిపళ్ళు అధికంగా తింటే జలుబు చేస్తుంది.

ఈ పళ్ళయొక్క దుర్గుణాలకు విరుగుళ్ళు: 1. అరటిపండు, 2. పంచదార, 3. వేడినీళ్ళు 4. గుల్కందు.

**సేకరణ: ఆకుండి నారాయణమూర్తి**

## మూగహృదయాలు

నన్నెందుకిలా చేసేవు? దేవుడేం చెప్తాడు దీనికి? ఈ కోపం పోగొట్టుకోడానికి నేను కొంచెం శ్రమపడితే దానంతటదే పోతుంది.

రాధకి చెపితే 'నన్ను క్షమించమ'ని. మైగాడ్! ఏడిచేస్తుంది. రాధకి నేనంటే ఎంతిష్టమో! నేనేం చేస్తున్నాను రాధ కోసం? నాకు జీవితంలో రాధ తప్ప యింకేమీ లేదని, రాధ లేకపోతే నేను బ్రతకలేనని తనకి తెలుసా?

ఆ రోజు తను వాళ్ళ పేరెంట్సుని చూడాలని ఉందని, కొన్నిరోజులు పుట్టింటికి వెడతానని అనగానే, ఎందుకో తెలియదు నాకు చిరాకు వచ్చింది. 'వెళ్ళు! నువ్వెళ్ళినంత మాత్రాన నేనుండలేనా? కొన్ని రోజులేం కావల్సినన్ని నెలలుండు. ఎవరొద్దన్నారు' అన్నాను. నేను కాలేజీలో చేరి, హాస్టలుకి వెళ్ళిన కొత్తలో అమ్మనీ, నాన్ననీ తలచుకుని ఎంత ఏడిచేవాడ్ని. రాధ వాళ్ళ అమ్మనీ, నాన్ననీ చూడాలను కోడంలో తప్పేముంది? కాని రాధ లేకుండా నేనొంటరిగా ఉండలేను, ఇలాగ అని ఉక్రోషం, చిరాకు వచ్చేయి నాకు. పిచ్చిదానికి ఎంత బాధ కలిగిందో. ఆనాడు అలా ఎందుకు అన్నాను. ఎంతగా బాధపడి ఉంటుందో. రాధ అప్పుడే నన్ను ఎందుకు తిట్టదు— 'మీరలా అనుకుంటారేమిటి? మీకు బుద్ధి లేదు.' అంటే ఎంత బావుంటుంది. అలా అన్నట్లు ఊహించుకుంటేనే ఎంత మధురంగా ఉంది. రాధకి నామీద అధికారం ఎప్పుడూ ఉంది. కాని అలా అనదు. నాకెంత బాధగా ఉంటుందో అందుకే

రాధప్పుడు వాళ్ళ పేరెంట్సు దగ్గరికెళ్ళిక రాసింది. నేను లేకపోతే ఉండలేక పోతున్నట్టు, ఏం తోచడం లేదని, ఇంకెక్కడికెళ్ళినా మనిద్దరం కలిసే వెడదామని — ఎంత ఏడిచానో ఆ ఉత్తరం చదివి. నేను తనతో విసుగ్గా ఉన్నా, కోపంగా ఉన్నా నన్నెంత లైక్ చేస్తుందని అని.

ఏమిటీ అనుబంధం? ఏమిటీ విచిత్రమైన ఆలోచనలు? రాధకోసం బాధ పడడంలోనే ఎంత ఆనందం ఉంది. ఎంత హాయిగా ఉంది జీవితం...

విజయ :

ఏమిటీ జీవితం ? ఇలా నిస్సారంగా, వెలితిగా ఉంది. నేను చేస్తున్న తప్పేమిటో అర్థం కావడంలేదు. ఆయన నా నుంచి అలా దూరంగా ఎందుకు తిరుగుతున్నారు ? నేనంటే అసహ్యం వచ్చిందా ? నేనేం చెయ్యను దానికి ? ఆయన తన ప్రవర్తన మార్చుకోడానికి ఎందుకు ప్రయత్నించరు ? ఇంతకీ నేను చేసినదేమిటి ? అర్థం కావడంలేదు.

ఆరోజు వెధవ సినిమాగురించి కూడా రాద్ధాంతమే. 'సినిమాకి వెడదాం విజయా' అన్నారు. 'ఏ సినిమాకి వెడదాం' అనడిగితే 'ప్రేమనగర్'కి వెడదామని నేనంటే 'ఛీ వెధవ సినిమా. 'తాసిల్దారుగారమ్మాయి'కి వెడదాం' అనడం. నా కిష్టమయిన సినిమాకి వెళ్ళకూడదా? పైగా 'ఛీ వెధవ సినిమా' అనడం. నా టేస్టు చెత్త టేస్టు అయినట్టు. అలాంటి మాటలని ఎందుకు బాధపెట్టాలి? నేను 'సినిమా వద్దు, ఏం వద్దు' అని కూర్చుంటే 'నామూడ్ అంతా పాడుచేశావు విజయా' అనడం. నా మూడ్ తను పాడుచెయ్యలేదా? నేనంటే నిజంగా ప్రేమే ఉంటే తనకిష్టం లేకపోయినా, నా కిష్టమయినది చెయ్యకూడదా? ఏమిటో, అంతా నాలాగే ఉంటారనుకోడం నా బుద్ధి తక్కువ. ఎవళ్ళకెంత రాసిపెట్టి ఉంటే అంతే జరుగుతుందేమో. రాధ మొగుడితో ఎంత హాయిగా ఉందో. నా జీవితాన్ని చూసుకుంటే నాకేడుపొస్తుంది. ఇందులో నా తప్పుకూడా ఉంది మరి. తను అన్నవాటన్నిటికీ అవుననకపోవడమే నా తప్పు. ఇటుపైనించి కుక్కలా 'అలాగే' అంటే సరి. అంతకీ చాలాసార్లు తను చెప్పినట్టే చేస్తాను కదా! ఏమిటో ఈయన బాధ అర్థంకాదు.

ఆరోజు పెళ్ళయిన కొత్తల్లో మా అమ్మ జ్ఞాపకంవచ్చి ఏడుస్తుంటే 'ఏమిటా ఏడుపు! పెళ్ళయిన వాళ్ళందరూ వాళ్ళ పేరెంట్సుని తల్చుకొని ఇలాగే ఏడుస్తున్నారా? ఇక్కడ నీకేమిటి తక్కువ' అని కసరడం. నా మనసు అర్థంచేసుకోలేని ఆ మనిషితో ఎలా మాట్లాడడం, ఏం మాట్లాడడం! అసలీ మగాళ్ళంతా ఇంతేనేమో. ఆరోజు రాధని దాని భర్త స్యాక్‌పేపర్లు నచ్చలేదని కొప్పడడం. ఆడవాళ్ళుకూడా మనుష్యులేననీ, మొగవాళ్ళలాగ కొన్ని తప్పులు చేయవచ్చునీ ఎందుకనుకోరో ?

నాకు తనంటే ప్రేమనీ, నేను జీవితాంతమూ తనతోనే ఉండాలికదా అనీ గర్వమూ ఈయనకి. తన ప్రవర్తనవల్ల ఏమైనా బాధపడుతున్నానని ఒక్కసారి ఆలోచిస్తారా అసలు ఈయన. ఒకసారి

అదే అడిగితే ఎంత చిరాకుపడ్డారని. 'నా ప్రవర్తన మార్చుకోనేముందు, నీ ప్రవర్తనలో లోపాలేమైనా ఉన్నాయేమో ఒక్కసారి ఆలోచించు' అనడం. నాకు తప్ప, తనకి లేవా మార్చుకోవలసిన అలవాట్లు. అసలు తనంతట తను ఎందుకు ఆలోచించరు — నేను చెప్పవలసిన అవసరం ఏమిటి అసలు.

## మహాగహ్వాదయాలు

పైగా చెపితే కోపం కూడాను. ఎలా ఈయనతో?

సరే అతిగా ఆలోచించి బుర్ర పాడు చేసుకోడం అనవసరమేమో! జరిగేది జరగక మానదు. ఎవరికర్మ ఎలా ఉంటే అలాగే

# ల్యూకోడెర్మా-కొన్నినిజాలు

— పి. రమేష్‌నారాయణ —

కొందరు వ్యక్తుల శరీరంపై అక్కడక్కడ వర్ణరహితంగా మచ్చలగపడుతుంటాయి. ఇలాంటివి ఎక్కువగ చేతులు, కాళ్ళు, మెడ, ముఖం లాంటి ప్రాంతాల్లో వ్యక్తమవుతూ వారికి అందవికారాన్ని కలిగిస్తుంటాయి. 'ల్యూకోడెర్మా' లేక 'విటిలిగో' అని శాస్త్రీయంగా పిలువబడే ఈ వ్యాధి తొలిదశల్లో చర్మంపై చిన్నచిన్న మచ్చలుగ ప్రారంభమవుతుంది. క్రమ్యాతిగ ఈ మచ్చలు పెద్దవవుతాయి. కాని ఇతర చర్మవ్యాధుల్లాగ దురద, బాధ, జ్వరము లాంటి రోగలక్షణములంటూ ఏవీ వారిలో కనపడవు.

ఈ వ్యాధి రావటానికి గల కారణాలను గూర్చి కొందరు కొన్ని సిద్ధాంతాలను లేవదీసినా అవి నిగిపోయాయి. పేగుల్లో నివసించే నులిపాములు, నర్వస్‌షాక్, అమీబియాసిస్‌ల వల్ల ఈ వ్యాధి రావచ్చు. కొందరిలో వంశపారంపర్యంగానయినా వచ్చే అవకాశాలున్నాయి. కాని వీటన్నింటికీ సరయిన శాస్త్రీయ సమాధానాలు తృప్తికరంగా ఇంకా లభించటం లేదు.

పై కారణాల వల్ల వస్తుందని భావింపబడే ఈ వ్యాధిరకాలు ఇలా వుంటాయి. (1) సాధారణంగా శరీరంలోని వివిధ ప్రాంతాల్లో ఈ మచ్చలేర్పడవచ్చు. దీన్ని 'కామన్ టైప్' అంటారు. (2) కొందరికి పెదవులు, కనుబొమలు, చెవులు, చేతులు, కాళ్ళులాంటి భాగాల్లో మాత్రమే సోకితే దీన్ని 'మెలంగ్ టైప్' అంటారు. (3) అలాకాక దేహంలో ఒకవైపు మాత్రమే ఇది వ్యక్తమయితే 'జోస్టెరిఫారం టైప్' అనబడుతుంది (4) లేదా ఈ విటలాగో అనువంశికంగా వస్తే దాన్ని 'హెరిడిటరీ టైప్' అని పిలువబడుతుంది.

సాధారణ మానవుల్లో చర్మపురంగు 'మెలనిన్' అన్న వర్ణపదార్థానికి సంబంధించిన కణాలవల్ల వస్తుంది. చర్మంలో ఈ మెలనిన్ ఏర్పడాలంటే, జీవరసాయనికంగా టైరోసినేస్, టైరోసిను, సల్ఫ్ హైడ్రిల్ గ్రూపులు, కాపర్ అంశాలమధ్య సమతాస్థితి ఏర్పడాలి. ఈ బేలన్స్ దెబ్బతిన్న పరిస్థితుల్లో చర్మభాగాలు మెలనిన్ లోపానికి దారితీస్తాయి. ల్యూకోడెర్మావ్యాధిగ్రస్తుల చర్మంలో సరిగ్గా ఇదేస్థితి ఏర్పడుతుంది.

ఆధునిక విజ్ఞానం ఆధారంగా ఇంతవరకు ఈ వ్యాధి నివారణకు సరయిన వైద్యమంటూ తెలీదు. ఈ రంగంలో ప్రయోగాలింకా రోగులపై కొనసాగుతూనే యున్నాయి. కాపర్ సల్ఫేటు, విటమిన్ 'బి' 12 వగైరాలు టాబ్లెట్ల రూపంలోనూ, గోల్డ్, మరియో క్రిసిన్‌లు ఇంజెక్షన్లగను రోగనిదానంలో ప్రయత్నించబడ్డాయి. అతినీలలోహిత కిరణ ప్రసారంకూడా ఈ వ్యాధి సోకిన చర్మభాగాలపై ప్రయత్నించబడింది. ఈ మధ్యే మనదేశంలో లక్నోకుచెందిన సెంట్రల్ డ్రగ్ ఇన్స్‌టిట్యూట్ విభాగం వారు కనిపెట్టిన 'సొరాలెన్' అన్న ఔషధాన్ని అతినీలలోహిత కిరణ ప్రసారంతో పాటుగ ఉపయోగిస్తున్నారు. ఇది కొంతవరకు రోగులపై తృప్తికరమయిన ఫలితాలనిస్తున్నదనే అనవచ్చు.

ఈ రోగానికి చెందిన మరో ముఖ్య విషయం— మనం సమాజంలోని వ్యక్తులనసహ్యించుకొనే వాటిలో నొకటయిన ఈ చర్మరోగం చాలమంది భావించే రీతిగ అంటువ్యాధి ఏమాత్రమూ కాదు. ఈ వ్యాధిగలవారు చేపలు, పాలు లాంటివి పుచ్చుకోకూడదని, అలా చెయ్యటం వల్ల రోగం ఎక్కువవుతుందని భావించేవారున్నారు. కాని అది పొరబాటు. నిజానికి పదార్థాలకు ఆ రోగానికి ఎలాంటి సంబంధమూ లేదు. ఇంతకూ చెప్పొచ్చేదేమిటంటే ఈ వ్యాధి సోకిన వ్యక్తులతో కలిసిమెలిసి హాయిగా తిరగటానికి, జీవించటానికి సమాజంలో మనమేమీ సంకోచించాల్సిన పనంటూ ఏమీలేదు.

జరుగుతుంది. ఒకరోజు ఆయన నన్నడిగినది తల్చుకుంటే ఇప్పటికీ బాధగా ఉంటుంది. నెక్లెసు చేయించి తీసుకొచ్చి కళ్ళు మూసుకోమని నా మెడలో పెట్టేరు. నాకు నెక్లెసు చూడగానే ఎంత ఆనందం వేసిందో. అద్దంముందు నిలబడి చూసుకుంటుంటే అన్నారు. 'నిన్నిలా ఆనందంగా చూస్తుంటే నాకెంత బావుందో' అని. నేను చాలసేపు మాట్లాడకపోతే అదోలా అడిగేరు. 'సీతా, పెళ్ళవగానే నగలుచేయించు కోగలిగిన ఆడవాళ్ళు ఎంతమందోవుండరని తెలుసా? యుఆర్ లక్కీ' అని. అదోలా అనిపించింది. ఏదో వెలితిగా అనిపించింది. ఏమిటో అర్థంకాలేదు. తరవాత కూర్చుని ఆలోచిస్తే అనిపించింది. తను నెక్లెసు తెచ్చియిచ్చినందుకు, నేను కృతజ్ఞత వెల్లడించుకోలేదని బాధనిపించిందేమో ఆయనకి. నా కృతజ్ఞతకోసం తెచ్చేరా, నా మీద ప్రేమవుండి తెచ్చారా అని క్షణం సేపు మనసు కొట్టుకుంది. ఏమిటో నెక్లెసు వేసుకున్న ఆనందం అంతా ఎగిరిపోయింది. ఊళ్ళో వాళ్ళు అనడం 'బావుందవమ్మా అదృష్టవంతురాలివి, పెళ్ళవగానే నగలు చేయించుకుంటున్నావ'ని. వాళ్ళకేం తెలుసు ఈ నగలిచ్చే మనసు వెనకవున్న ఆలోచనలు. నాకు కావలసినది నగలుకాదని. ప్రేమని ఈయనకి ఎప్పుడు తెలుస్తుంది.

సుధ!

విజయనించి నేనాశించినది దొరకడం లేదనిపిస్తోంది. ఎంతక్కువచేసాను నేను. తనంటే నాకు అమితమైన ప్రేమ అన్న విజయకి నేనంటే అలుసేమో అనిపిస్తుంది అప్పుడప్పుడు. నేను నెక్లెసు ఇచ్చినప్పుడు ఒక్కమాట అనచ్చుగా 'మీరెంత మంచివారండీ' అని. నేనేం తనకి చెప్పుకోలేదే, నేనా నెక్లెసు కొనడానికెంత కష్టపడాల్సి వచ్చిందో! ఎప్పుడూ లేనిది లంచంకూడా తీసుకున్నాను తనకోసం. నేనుచేసిన దానికి విజయనించి కృతజ్ఞత కోరుకోడంలేదు. కాని ఒక్కసారి తను అనచ్చుగా. తనకి నిజంగా ఆనందం ఉంటే ఆ మాట అంటే నేనెంత ఆనందపడతాను. అది గ్రహించలేదా విజయ? లేకపోతే గ్రహించినా చెప్పడంలేదా! 'పెళ్ళి చేసుకున్నాక సుఖపెట్టక ఏంచేస్తాడు ఇంత కట్నం తీసుకుని' అనుకుంటోందా? ఏమిటిలా ఉంది

# తెలుగు చిత్రానికి హిందీ నటుడు



# సతీష్ అరోరా

'ఉమంగ్' హిందీ చిత్రనాయకుడ్ని తెలుగులో కథానాయకుడిగా పరిచయం చేస్తున్నారు, 'నీతి నిజాయితీ' నిర్మాతలు, దర్శకుడు. అతిగాడికి యీ అవకాశం ఎలా వచ్చింది, తెలుగు చిత్రంలో నటించేటప్పుడు కలిగిన భావాలు ఏమిటి?

ప్ర: మీ ఒరిజినల్ పేరు సతీష్ యేనా?

జ: సతీష్ అరోరా. ఇది నా తల్లిదండ్రులు పెట్టిన పేరు.

**హృదయానికి హత్తుకున్న కథ**

ప్ర: మీరు యీ రంగంలోకి ఎలా వచ్చారు?

జ: నేను 'ఉమంగ్' హిందీ చిత్రంలో నాయకుడిగా నటించాను. ఒక శుభదినాన 'సంస్కార' ఎగ్జిక్యుటివ్ దర్శకుడు శింగీతం శ్రీనివాసరావు, ఎగ్జిక్యుటివ్, నిర్మాత శంకర రెడ్డి వచ్చి 'నీతి—నిజాయితీ' కథను చెప్పి, నన్ను నాయకుడి పాత్ర వెయ్యమని అడిగారు. కథ నా హృదయానికి హత్తుకుంది. వెంటనే సరే అని అగ్రిమెంటులో సంతకం చేశాను.

**భాష కన్నా భావం ముఖ్యం...**

ప్ర: మీకు తెలుగు భాష వచ్చా?

జ: భాష రాకపోతే ఏమండీ. నటుడికి ముఖ్యంగా కావలసింది ఎక్స్‌ప్రెషన్ అన్న భావం గలవాడ్ని నేను. పైగా నేను ధరిస్తున్న పాత్రకి మాటలు లేవు. (డంబ్ అంటే మూగ పాత్ర)

ప్ర: చిత్రం అదినుండి తుదివరకు మూగపాత్రేనా?

జ: అవును, మనస్సులో పుట్టుస్తున్నయ్యే భావాలను చెప్పాలన్న పుబలాటం — కానీ, చెప్పడానికి నాల్క పలకని దీనావస్థ— యిది 'నీతి—నిజాయితీ'లోని నా వేషం.

ప్ర: హిందీ చిత్రాల్లో మీకు డబ్బు ఎక్కువ యిస్తారనుకుంటాను... ఇక్కడ?

జ: క్యారెక్టరు మంచిదయినప్పుడు, డబ్బు ప్రసక్తి రాదు. (నామటుకు)

**దర్శకుని తర్ఫీదు**

**నటీనటుల ప్రోత్సాహం**

ప్ర: డైరెక్టరు. సాటి నటీనటులపై మీ అభిప్రాయం?

జ: దర్శకుడు శ్రీనివాసరావుగారు జీనియస్! నాకు తెలుగు రాదు—వారికి హిందీ రాదు. కానీ, ఆయన నాకు మంచి తర్ఫీదునిచ్చి, తమకు కావలసిన ఎఫెక్టును తెప్పించుకునేవారు. ఈ చిత్రంలో నాకు మంచిపేరు వస్తే, అది డైరెక్టర్‌గారికే వర్తిస్తుంది.

నటీనటులందరూ, ముఖ్యంగా కాంచన, గుమ్మడి, కృష్ణంరాజు నాలో ఉత్సాహాన్ని, ఉత్తేజాన్ని యేర్పరచి, నన్ను వాళ్ళలో ఒకడిగా పరిగణించేవారు.

ప్ర: మీ పాత్రను పోషించేటప్పుడు, కష్టం అనిపించిందా?

జ: మాటలు పలకలేని మూగవాడి పాత్ర అంటే మీరే వూహించండి. కేవలం సంజ్ఞలతో, కంటిచూపుతో నటించాల్సిందేగా.

ప్ర: మద్రాసులో మీకు సౌకర్యాలు...?

జ: నిర్మాత శంకరరెడ్డి వారి ఆఫీసులో నాకొక గదినిచ్చి, నాకు కావలసిన సౌకర్యాలన్నింటిని చూస్తున్నారు. అలాగే దర్శకుడు శింగీతం శ్రీనివాసరావు నన్ను వారి తమ్ముడిలాగా ఆదరిస్తున్నారు. నాకు ధైర్యం చూపిన ఆప్తులు వాళ్ళే.

ప్ర: 'నీతి నిజాయితీ' చిత్రం పై మీ అభిప్రాయం?

జ: వాస్తవికత వున్న కథ. వెరైటీ పాత్రలున్న కథ. వాటికి న్యాయం చేకూర్చిన దర్శకుని ప్రతిభ, మధురమైన సంగీతం, పాత్రకు సరిపడే నటన వున్న యీ చిత్రం ప్రజాదరణ పొందడం తథ్యం.

**తెలుగు నేర్చుకోవాలనే ఆసక్తి**

ప్ర: మీకు తెలుగు నేర్చుకోవాలన్న ఆశ లేదా?

జ: ఇప్పుడిప్పుడే, కృష్ణయ్య (అసిస్టెంట్ డైరెక్టర్) వద్ద నేర్చుకుంటున్నాను. పై ఏడాదికి తెలుగు బాగా రావచ్చు.

ప్ర: మీకు ప్రస్తుతం ఎన్ని చిత్రాలు వున్నాయి?

జ: తెలుగులో యిదొక్కటే వుంది. హిందీలో రెండు వున్నాయి.

ప్ర: మీకు స్విమ్మింగ్...రైడింగ్...?

జ: రన్నింగ్, ఫైటింగ్‌లాంటి వన్నీ వచ్చు.

ప్ర: మీ నిర్మాతలపై మీ అభిప్రాయం?

జ: శ్రీ సంజీవి మూవీస్ అధినేతలైన ఎవ్. లక్ష్మీకాంతరెడ్డి, హెచ్. వి. సంజీవరెడ్డిగార్లు తీస్తు వున్న నిర్మాతలు. మంచి కథ కోసం తాపత్రయపడే వ్యక్తులు. ఖర్చుకు వెనకాడని ధీమంతులు. ఇలాంటి మంచి సంస్థలో నాకు నాయకుడి పాత్ర లభించడం నా అదృష్టం.

—ఇంటర్వ్యూ: శ్రీనివాస్



'మానవుడు దానవుడు'లో శోభన్‌బాబు, శారద.

# సినిమా

## ఎవర్‌గ్రీన్ హీరోయిన్!

'ఎవర్ గ్రీన్ హీరో' అంటూ నాగేశ్వరరావును పేర్కొనే వాళ్ళం. ఇప్పుడు 'ఎవర్ గ్రీన్ హీరోయిన్' అని ఒక క్యారెక్టరు నటిని చెప్పి తీరాలి. ఆమె పేరు నిస్సందేహంగా జమున.

జమునకి ప్రేక్షకుల్లో ఒక ప్రత్యేక ఆంతస్తు, గౌరవం వుంది. పరిశ్రమలో అడుగిడి 20 సంవత్సరాలు దాటినా, ప్రేక్షకుల అభిమాన నటిగా వుండగలగడ మంటే అందరికీ సాధ్యమా? కొందరు కొంతకాలం ప్రకాశించగలరు. మరికొందరు మధ్యలోనే ఆగిపోతారు. కానీ జమున నాటి నుండి నేటివరకు ప్రముఖ నటిగానే విరాజిల్లుతూంది.

## ఆత్మ విశ్వాసం వున్న నిర్మాత

నాలుగు చిత్రాలు వరుసగా దెబ్బ తింటే, ఆ చిత్ర నిర్మాత ఎలా వుంటాడో వూహించుకోండి. మనిషిగా వుండడం కష్టం. కానీ నాలుగు గట్టిదెబ్బలు తిన్న విఠలాచార్య ఎప్పటిలాగే నవ్వుతూ, జోక్స్ విసురుతూ వుండడాన్ని చూచి విస్తుపోయాను.

'నిన్నే పెండ్లాడుతా' దగ్గర్నుండి 'బీదల పాట్లు' వరకు విఠలాచార్యకు పెద్ద దెబ్బ తగిలింది. గతవారం ఆయన్ని పరశువాకం లోని వారి ఆఫీసులో కలిసాను. అప్పుడాయన ఓంపోరావ్ చెపుతున్న కథను వింటున్నారు.

'బీదలపాట్లు' ఫెయిల్యూర్‌కి కారణం చెప్పగలరా? అని అడిగాను 'నేనే' అన్నారు ఆయన. 'నాకు రోజులు బాగా లేవు. నా దురదృష్టం వల్ల, ఆ చిత్రం దెబ్బ తినింది. అయినా, ఎప్పుడూ సుఖాన్ని, లాభాన్ని ఆపేక్షించడం ధర్మమా చెప్పండి?' అన్నారు.

'నేను యీ పరిశ్రమలో చాలా ఆర్జించాను. మంచిపేరు సంపాదించాను. పది సంవత్సరాలు టాప్‌లో కూర్చున్నాను. దిగాను. మరలా ఎక్కగలననే నమ్మకం నాకు వుంది. కష్టసుఖాలు, లాభనష్టాలు చీకటి వెలుగుల లాంటివి. అమావాస్య పోతే పౌర్ణమి వస్తుంది. అలాగే చెడు పోయి మంచి జరుగుతుంది.' అన్న ఆచార్య ఆత్మ విశ్వాసాన్ని అభినందించాను

'నేను ఆర్థికంగా దెబ్బలతినియుండ వచ్చు. కాని, నాగేశ్వరరావుగారిలాటి మంచి మిత్రుడ్ని, శ్రేయోభిలాషిని పొందగలిగాను. ఆయనది జాలిగుండె. స్నేహానికి, సహృదయతకి ఆయనకి ఆయనేసాటి', అన్నారు, విఠలాచార్య.

నేను అక్కడ వున్నసమయంలోనే ముగ్గురు నిర్మాతలు విఠలాచార్య వద్దకు వచ్చి మీరు మా చిత్రాలను డైరెక్ట్ చేసి పెట్టాలి అని అడిగారు ఆయన వాళ్ళ కిచ్చిన సమాధానం! 'నాకు యిప్పుడు దశ బాగులేదు. నాడబ్బయితే ఫర్వాలేదు వచ్చినా, పోయినా నాకే వర్తిస్తుంది పారియడ్ బాగులేదని తెలిసి, నేను మీ చిత్రాలను అంగీకరించి, విడుదలై అవి దెబ్బతింటే మీరు బాధపడడం దేనికి? అంత్య నిష్ఠూరంకన్నా ఆదినిష్ఠూరం నయం', అని వాళ్ళని పంపించారు, ఆచార్య.

## మహాదుష్ట పాత్రల్లో రామారావు

మంచి చిత్రాలు, బాక్సాఫీస్ చిత్రాలు నిర్మించడంలో అందెవేసిన చేయి త్రివిక్రమరావు. ఎన్. ఏ. టి. సంస్థకి ప్రజల్లో

## సినిమా డైరీ

● సుభాషిణి ఆర్ట్ పిక్చర్స్ నిర్మిస్తున్న చిత్రానికి 'అనుమానం—పెనుభూతం' అని పేరు పెట్టారు. 9 రీళ్ళు తయారైంది. కె. హేమాంబరధరరావు దర్శకుడు.

● జగపతి ఆర్ట్ పిక్చర్స్ వారి 'బంగారుబాబు' రెండవ షెడ్యూలు మే 4న కూనూరులో ప్రారంభమవుతుంది. వి. బి. రాజేంద్రప్రసాద్ దర్శకుడు.

● సి. వి. ఎమ్. సంస్థ శోభన్‌బాబును హీరోగా బుక్ చేసింది.

● రేఖా అండ్ మురళీ ప్రొడక్షన్స్ 'ఆ జన్మ బ్రహ్మచారి' పేరిట ఒక హాస్య చిత్రాన్ని నిర్మిస్తున్నారు.

● త్రివేణి ప్రొడక్షన్స్ వారి 'బడిపంతులు' అవుట్‌డోర్ మే 2 నుండి 10 వరకు మద్రాసు పరిసర ప్రాంతాల్లో జరుగుతుంది. పి. చంద్రశేఖర రెడ్డి దర్శకుడు.

● ఆర్. ఎస్. మూవీస్ 'సుబ్బమ్మ కథ' మొదటి పాట రికార్డింగు మే 17న విజయలో జరుగుతుంది. శ్రీ వి. సంజీవి దర్శకుడు.

వింతగౌరవం పురిదో మనవదరికీ తెలుసు. ఈ సంస్థ నిర్మించే చిత్రాల్లో 90 శాతం నూరుదినాల పండుగను జరుపుకున్నవే. ప్రస్తుతం 'కులగౌరవం' చిత్ర నిర్మాణం చురుకుగా సాగుతోంది. ఆంధ్రుల అభిమాన కథానాయకుడు ఎన్టీ రామారావు తాత, తండ్రి, మనవడుగా మూడుపాత్రలను అసాధారణ ప్రజ్ఞా ప్రాభవాలతో పోషిస్తున్నట్లు పరీక్షను అంతా చెప్పుకుంటున్నది. ఈ చిత్రం పరిశ్రమలో, ప్రజల్లో, పత్రికల్లో సంచలనం కలిగించడం తథ్యం, అని భావిస్తు

న్నాడు; జయంతి నాయిక; విస్సీ రామారావుతో ఆరతి ఒక ముఖ్యపాత్రను పోషిస్తూంది. చక్కటి, చిక్కటి కుటుంబ కథను ముఖ్యాంశంగా గొన్న యీ చిత్రానికి పేకేటి శివరాం దర్శకుడు. విజయా విడుదల.

## ఏ. వి. ఎం. లో శోభన్‌బాబు

'లేతమనసులు, రాము, మూగనోము' లాంటి వుత్తమ చిత్రాలను నిర్మించిన తమిళ సంస్థ ఏ. వి. ఎమ్., త్వరలో ఒక సముజ్వల సాంఘికాన్ని ప్రారంభించబోతూంది.

'భర్తే దైవం; మెట్టినిల్లే స్త్రీకి స్వర్గం' అనే ధర్మాన్ని ప్రబోధించే అంశం గొన్న కుటుంబగాథను యీ సంస్థ తెరకెక్కించబోతూంది.

తమిళంలో 'పుగుందవీడు' పేరిట విజయవిహారం చేస్తున్న యీ కథను ఏ. ఎస్. ప్రకాశం వ్రాశారు. పట్టు దర్శకత్వం వహించారు. మద్రాసు నగరంలో సంచలనం కలిగించింది చిత్రం.

అలాంటి చిత్రాన్ని తెలుగులో చూపించే బాధ్యతను ఏ. వి. ఎమ్. స్వీకరించింది. కథానాయకుడి పాత్రను శోభన్‌బాబు పోషిస్తారు. చెల్లెలికోసం ఎలాంటి త్యాగానికయినా సిద్ధపడే అన్నయ్యపాత్రను శోభన్ పోషిస్తారు. ఈ యువనటుడికి మరొక సవాలులాంటి పాత్ర యిది. అంతే ప్రాధాన్యత గల నాయకుని పాత్రను కృష్ణను నిర్వహించవలసినదిగా నిర్మాతలు కోరుతున్నారట. ఆ భూమికను కృష్ణ ధరిస్తే, కథకి బలం చేకూరుతుంది అనడంలో సందేహం లేదు. తెలుగుప్రతిని కూడా పట్టు డైరెక్టు చేస్తారు.

## క్లిష్టమైన పాత్రలలో కృష్ణ

ప్రస్తుతం కృష్ణకి వెరైటీ పాత్రలు లభిస్తున్నాయి. నిర్మాణంలో వున్న 'అబ్బాయిగారు అమ్మాయిగారు, ఇల్లు—ఇల్లాలు, పండంటికాపురం' చిత్రాల్లో కృష్ణ చక్కటి నటన్ని ప్రదర్శిస్తున్నట్టు రషస్ చూసినవాళ్ళు చెపుతున్నారు.

పై చిత్రాలుగాక, యిప్పుడు అంగీకరించిన చిత్రాల్లో కూడా కృష్ణకు కొత్తదనం వున్న పాత్రలు దొరికాయి. ఆర్. ఎస్ మూవీస్ 'మల్లమ్మకథ,' అనంతలక్ష్మీ మూవీస్ సాంఘికంలో, శ్రీనివాసామూవీస్ చిత్రంలో కృష్ణకి క్లిష్టమైన పాత్రలు లభ్యమైనాయి.



'మేనకోడలు'లో జమున, రోజారమణి.

## మొదటిసారి శారదతో జత!

కృష్ణ అందరితో (హీరోయిన్లతో) నటించారు. ఇంకా శారదతో జతకుదర లేదేం అనుకుంటున్న సమయంలో, ఆర్. ఎస్. మూవీస్ అధినేత చెంచురామయ్య 'మల్లమ్మకథ' జంటగా కృష్ణ — శారద అని చెప్పడం జరిగింది.

కృష్ణ, శారద ఒకేవూరివాళ్ళు. (తెనాలి) ఇప్పటికి యిద్దరికీ జత కుదిరింది.

చెంచురామయ్య అంటే పత్రికలలో తెలియని వారుండరు. ఆయన 15 యేండ్ల క్రిందట 'రతీమన్మధ'ను పెద్ద హీరోలతో తలపెట్టడం జరిగింది. అనివార్య కారణాల వల్ల ఆ ప్రయత్నం విఫలమైంది. ఇన్నాళ్ళకు భగవంతుడు మేలుచేశాడు. ఇప్పుడు 'మల్లమ్మకథ'ను అక్కినేని సంజీవి దర్శకత్వంలో నిర్మిస్తున్నారు.

'మల్లమ్మ కథ'లో నాయికగా శారద, నాయకుడిగా కృష్ణ, రెండవ నాయకుడిగా రామకృష్ణ, నాయికగా విజయలలిత నటించడానికి అంగీకరించారు. ఈ చిత్రానికి కోదండపాణి సంగీతాన్ని, దాసరి నారాయణరావు రచన్ని, నాగేశ్వరరావు కళను, కె.వి. రావ్ సహాయ దర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు. ప్రస్తుతం బోగ్‌రోడ్డులోని వారి ఆఫీసులో పాటల కంపోజింగ్ జరుగుతూవుంది. షూటింగు జూన్‌లో ప్రారంభం.

## అనుమానం—పెనుభూతం

సుభాషిణీ ఆర్ట్ పిక్చర్స్ నిర్మించే సాంఘికం ఏప్రిల్ షెడ్యూలుతో 9 రీళ్ళు అయింది, అని దర్శక, నిర్మాత హేమాంబరధరరావు చెప్పారు. కథకుతగ్గ టైటిల్ దొరికింది, ఆయనకి.

మంచి చిత్రాలను నిర్మించాలన్న కాంక్ష వున్న వ్యక్తి హేమాంబరధరరావు. అది నిజమని వారి గత చిత్రాలే సాక్ష్యం యిస్తాయి. ఈ చిత్రంలో జమున అసాధారణ నటన్ని చూపెడుతున్నట్టు షూటింగు చూసినవాళ్ళు, రషస్ చూసినవాళ్ళు ఏకకంఠంతో చెపుతున్నారు. అలాగే నాగభూషణం నటనకూడా.

ఏప్రిల్‌లో పక్షం రోజులపాటు

## మీకు తెలుసా?

1971 లో విడుదలైన చిత్రాలు:

| | | |
|---|---|---|
| తెలుగు చిత్రాలు | — | 85 |
| తమిళ చిత్రాలు | — | 73 |
| హిందీ చిత్రాలు | — | 117 |
| మళయాళ చిత్రాలు | — | 52 |
| వంగ చిత్రాలు | — | 30 |
| కన్నడంలో విడుదలైనవి | — | 36 |
| మరాఠీ చిత్రాలు | — | 23 |
| ఉర్దూలో వచ్చినవి | — | 4 |

గుజరాతీలో మూడు, పంజాబీలో రెండు వచ్చాయి.

ఆంగ్లం, ఒరియా, సింధీ భాషల్లో ఒక్కొక్కటి చొప్పున విడుదలైనయి.

షూటింగు జరిగింది. ఆరుద్ర వ్రాసిన రెండు పాటల రికార్డింగుకూడా జరిగింది. కథ, మాటలను భమిడిపాటి, సంగీతాన్ని కోదండపాణి, కళను బి. ఎన్. కృష్ణ, ప్రొడక్షన్ను మహేంద్ర, ఛాయను శేఖర్—సింగ్ నిర్వహిస్తున్నారు.

## కృష్ణంరాజు కుమారుడుగా చంద్రమోహన్!

'అనుమానం—పెనుభూతం' చిత్రంలో జమున, కృష్ణంరాజుల కుమారుడిగా చంద్రమోహన్ నటిస్తున్నారు. 'రంగుల రాట్నం' తర్వాత చంద్రమోహన్‌కి అంతటి పాత్ర యిక్కడ లభించింది. జమున—హేమాంబరధరరావుల కాంబినేషన్ లో తయారయ్యే మొదటి చిత్రంకూడా యిదే. ఈ చిత్రంలోని ప్రధాన పాత్రలను నాగయ్య, అల్లు రామలింగయ్య, సూర్యకాంతం, కృష్ణకుమారి, జయ పోషిస్తున్నారు. జూన్ షెడ్యూలుతో షూటింగు పూర్తవుతుందని, హేమాంబరధరరావు చెప్పారు. పూర్ణా విడుదల.

## సుభాషిణిలో శోభన్!

జూన్ 21 న సుభాషిణీ ఆర్ట్ పిక్చర్స్ మరొక చిత్రాన్ని ప్రారంభిస్తారు, హీరోగా శోభన్ నటిస్తారు. ముఖ్యపాత్రను నాగభూషణం ధరిస్తారు. కథ, మాటలు: భమిడిపాటి. దర్శకత్వం: హేమాంబరధర రావు.

## చలం చిత్రానికి అవార్డు!

శ్రీ రమణచిత్ర నిర్మించిన 'మట్టిలో మాణిక్యం' చిత్రానికి ప్రాంతీయ ఉత్తమ చిత్రం బహుమతి లభించింది. ఈచిత్రంలో చలం, పద్మశ్రీ భానుమతి, జమున ముఖ్య పాత్ర ధారులు. బి. వి. ప్రసాద్ దర్శకుడు.

భారత్ అవార్డు ఎం. జి. ఆర్. కి, ఊర్వశి బిరుదు వహీదారెహ్మాన్‌కి, ఉత్తమ గాయకురాలు అవార్డు సుశీలకి, ఉత్తమ దర్శకుని బహుమతి గిరీష్‌కర్నాడ్, బి. వి. కర్నాడ్ గార్లకు వచ్చింది.

'బంగారుపతకం' సత్యజిత్‌రాయ్ దర్శకత్వం వహించిన 'సీమబద్ధ'కి లభ్యమైంది.

## భారతీయ చిత్రానికి గ్రాండ్ ప్రిక్స్

టెహరాన్‌లో జరిగిన అంతర్జాతీయ ఫిలిం ఉత్సవంలో ఫిలిమ్ అండ్ టెలివిజన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ ఇండియా నిర్మించిన 'విలాప్'కి లభించింది. ఈ చిత్రానికి సురేంద్ర చౌదురి దర్శకుడు.

## బంగారుబాబు ఊటీ ప్రయాణం

జగపతి ఆర్ట్‌పిక్చర్స్ 'బంగారుబాబు' కలర్‌చిత్రం యొక్క రెండవ షెడ్యూలు మే 4 న కూనూర్, ఊటీల్లో ప్రారంభమవుతుందని, నిర్మాత—దర్శకుడు శ్రీ వి. బి. రాజేంద్రప్రసాద్ చెప్పారు.

పై సుదహరించిన లొకేషన్స్‌లో అయిదు పాటల చిత్రీకరణ, ముఖ్యమైన సన్నివేశాలు, ఫైట్స్ చిత్రీకరణ జరుగుతుందని వ్యక్తపరిచారు. మే నెలాఖరువరకు షూటింగు జరగగలదని, యీ షెడ్యూలులో చిత్రంలోని నటీనటులందరూ పాల్గొంటారని వెల్లడించారు.

'బంగారుబాబు' చిత్రానికి ఆచార్య ఆత్రేయ కలం, మహదేవన్ సంగీతం, వెంకటరత్నం ఛాయాగ్రహణం పోటా పోటీగా పనిచేసి, మరొక సంచలనాన్ని కలిగించే ప్రయత్నాల్లో వున్నట్లు తెలుస్తోంది. 'దర్శకత్వం మాటంటారా? 'దసరాబుల్లోడు' ఫేం రాజేంద్రప్రసాద్ ప్రతిభను మరింతగా ప్రకాశింపచేస్తుందీ చిత్రం.

టైటిల్ పాత్రను నాగేశ్వరరావు, నాయికగా వాణిశ్రీ, హీరో చెల్లెలిగా జయంతి నటిస్తున్నారు. ఈ చిత్రం అన్నపూర్ణా ద్వారా విడుదలవుతుంది.

(64వ పేజీ చూడండి)

**కృష్ణ**

'ఇవే మా యింట్లో చివరి పెళ్లిళ్ళు! మళ్లీ పదిహేను ఏళ్ళదాకా పెళ్లి ప్రసక్తే లేదు' అన్నారు, హీరోకృష్ణ — యిటీవల జరిగిన తన తమ్ముడు, చెల్లెళ్ల పెళ్లిళ్ల గురించి ముచ్చటిస్తూ.

15 ఏళ్ల తర్వాత జరిగే పెళ్లిళ్లు — వాళ్ల అబ్బాయి రమేష్‌దీ — కుమార్తె పద్మదీ... 'వాళ్లిద్దరి పెళ్ళిళ్ళూ కూడా ఒకేసారి చేస్తాను!' అంటూ నవ్వారు కృష్ణ.

'మోసగాళ్ళకు మోసగాడు' హిందీ వెర్షన్ కలకత్తా, తూర్పు పంజాబ్‌లలో విడుదలయి బంపర్ కలెక్షన్స్‌తో నడుస్తోంది. హిందీలో ఇంత విజయవంతమవుతుందని నేను అనుకోలేదు. హిందీ వెర్షన్ కొన్నవాళ్ళు డబ్బింగ్ చాలా పెర్‌ఫెక్ట్‌గా చేశారు. డైరెక్టు టేక్ చిత్రంలా ఉంది.' అన్నారాయన, టాపిక్ మార్చి... కలకత్తాలో 20 ప్రింట్లు, ఈస్ట్ పంజాబ్‌లో 7 ప్రింట్లు విడుదల చేశారు. రు 1.66 పైసల టిక్కెట్లు కలకత్తాలో బ్లాక్‌లో రూ. 100కి అమ్ముతున్నట్లు వారి కార్యాలయానికి వచ్చిన ఉత్తరం ఒకటి నాకు చూపించారు కృష్ణ.

ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, మైసూరు రాష్ట్రాలలో సంచలనం సృష్టించిన యీ చిత్రం బెంగాల్‌లో విపరీతమయిన సంచలనం లేవదీయడం గమనార్హం. ఉత్తర హిందుస్థాన్ అంతటా ఈ నెలాఖరులోగా విడుదల కానున్న యీ హిందీ వెర్షన్ పేరు 'గన్ ఫైటర్ జానీ!'

'ఇంగ్లీషు వెర్షన్ డబ్బింగ్ పూర్తి అయింది. మిక్సింగ్ జరగవలసి వుంది. అది కూడా ఫినిష్ చేసి ప్రపంచమంతటా విడుదల చేయటానికి కాంటినెంటల్ ఫిలిమ్స్ వారితో ఎరేంజ్‌మెంట్స్ చేస్తున్నాము.' అని కూడా చెప్పారు కృష్ణ. ఇంగ్లీషు డబ్డ్ వెర్షన్ 4 రీళ్ళు యీ విలేఖరి చూశాడు. రాన్ డెగ్ అనే ఆయన సంభాషణలు రాశారు. బ్రాడ్వే స్టేజి ప్లేయర్స్, స్టేజి డైరెక్టరు మున్నగువారు ఇంగ్లీషు వెర్షన్‌కి గొంతులను ఎరువిచ్చారు.

ఇప్పుడు కృష్ణ శ్రీ యస్. భావనారాయణతో కలసి 'మంచివాళ్లకు మంచివాడు', నటుడు శ్రీ ప్రభాకరరెడ్డితో కలసి 'పండంటి కాపురం' చిత్రాలను సంయుక్తంగా నిర్మిస్తున్నారు. ఈ రెండూ పూర్తి రంగుల చిత్రాలు. వీటి గురించి మాట్లాడుతూ కృష్ణ 'మంచివాళ్లకు మంచివాడు' మే 15 కల్లా పూర్తి అవుతుంది. జూన్‌లో విడుదల చేస్తున్నాము. పండంటి కాపురం షూటింగ్ నిర్విరామంగా జరుగుతున్నది. ఆగస్టులో విడుదల అవుతుంది.' అని చెప్పారు.




'మా స్వంత సంస్థ శ్రీ పద్మాలయా మూవీస్ పేరున మరొక కొత్త తరహాకు చెందిన చిత్రం ఆగస్టు 20 నుంచి ప్రారంభిస్తున్నాము. ఈ చిత్రానికి విదేశాల్లో అవుట్‌డోర్స్ చేస్తున్నాం. ఈ అవుట్‌డోర్స్ హాంకాంగ్, సింగపూర్, కౌలాలంపూర్, బాంకాక్‌లో జరుపుతాము. అవి ఈ చిత్రానికి అనుగుణంగా ఉండే లొకేషన్స్. ఫారిన్ అవుట్‌డోర్ షూటింగ్ అక్టోబరులో 25 రోజులపాటు కొనసాగుతుంది' అని కూడా వివరించారు కృష్ణ.

ఒకప్రక్క తీరికలేని నటుడిగా నిర్విరామంగా పని చేస్తూ, మరోప్రక్క సంయుక్త చిత్రాలు, స్వంతచిత్రం నిర్మిస్తున్న కృష్ణ కృషిని, కార్యనిర్వహణా సమర్థతను అభినందించనివారు ఉండరు.

**చంద్రకళ**

'ద్విపాత్రాభినయం చేస్తానని అనుకున్నానుగాని—ఆ అవకాశం యింత తొందరగా వస్తుందని అనుకోలేదు' అన్నది కుమారి చంద్రకళ— యిటీవల 'శాంతి నిలయం' సెట్స్ బయట విరామ సమయంలో.

చంద్రకళ ద్విపాత్రాభినయం చేస్తున్న చిత్రం పూర్ణా ఆర్ట్ పిక్చర్స్ వారిది. 'షూటింగ్ ఇంకా ఆరంభం కాలేదు. మే నుంచి స్టార్టవుతుంది. ఈ సంవత్సరం వచ్చే చిత్రాలలోని నా కేరక్టర్స్ అన్నీ మంచివే లభించడం నా అదృష్టం' అని కూడా అన్నదామె.

చంద్రకళ నటించిన కన్నతల్లి, శాంతి నిలయం, కిలాడీ బుల్లోడు చిత్రాలు నిర్మాణం పూర్తి అయి విడుదలకు సిద్ధమవుతున్నాయి. హీరోయిన్ కేరక్టరు ప్రధానంగా గల చిత్రాలలో ఇన్స్‌పెక్టరు భార్య, చిత్రాలయ పిక్చర్స్ చిత్రం— నిర్మాణం చివరిదశలో ఉన్నాయి. 'ఈరెండు చిత్రాలలోను కథానాయికకు ఎంతో ప్రాధాన్యత ఉంది. ఆ పాత్రలపోషణకు నా శాయశక్తులా కృషిచేస్తున్నాను' అన్నది చంద్రకళ.

ఆమెచేసే ఏ కేరెక్టరులయినా, చక్కగా స్టడీచేసి మరీచేస్తుంది, నటిగా పేరు ప్రఖ్యాతులు తెచ్చుకుంటున్నా చంద్రకళ యీనాటికీ నృత్యప్రదర్శనలు యివ్వటం మానలేదు. 'పెళ్లిళ్లకీ, ఫంక్షన్స్‌కీ నేను నాట్యప్రదర్శనలు యివ్వటంలేదు. బెనిఫిట్ షోలకి— అంటే ముఖ్యంగా కాలేజీలకీ, స్కూల్స్‌కీ మాత్రమే యిస్తున్నాను.' అన్నదామె.

చంద్రకళలో యీ మధ్య కొత్త అందం వచ్చింది. ఇదివరకు—అంటే మొన్నమొన్నటి దాకా సన్నగా ఉండేది. ఇప్పుడు కొంచెం వొళ్లుచేసింతర్వాత చూడముచ్చటగా ఉంది. మొహంలో కూడా కొద్దిగా మార్పు వచ్చి ఆమె అందం ద్విగుణీకృతం అయిందిప్పుడు.

'సంపూర్ణ రామాయణం'లో సీతగా ఆమెను చూస్తున్నప్పుడు మనలో ఒక పవిత్రభావం కలుగుతుంది. నిజమయిన సీతనే చూస్తున్న అనుభూతి కలుగుతుంది. చూసేవారిలో అలాంటిభావాన్ని కలిగించటానికి ఎంతో శ్రద్ధ తీసుకోవాలి. చక్కని కృషికావాలి. అందుకు తగిన రూపలావణ్యాలు ఉండాలి. ఇవన్నీ చంద్రకళలో ఉండటంవల్లనే ఆపాత్రలో ఆమె జీవించింది.

ఈ విలేఖరి చంద్రకళతో ముచ్చటిస్తున్నప్పుడు—తాను సన్నగా ఉన్నానా? లావుగా ఉన్నానా ? అనే సందిగ్ధంలో పడిందామె. 'లావు కాదు, సన్నమూ కాదు. ఇప్పుడు నిండుగా ఉన్నారు!' అని నాతోపాటు నలుగురయిదుగురు చెప్పేసరికి 'హమ్మయ్యా!' అని సంతృప్తిగా శ్వాస పీల్చుకుంటూ 'ఇక

మీరలా ఇలాగే మేకప్ చేస్తే మేసు. లావు అవ్వాలంటే లావూ—సన్నబడాలంటే సన్నబడిపోయే చిట్కా నాకు తెలుసు.' అన్నది చంద్రకళ నవ్వుతూ.

'ఆ చిట్కా ఏమిటో అందరికీ చెప్ప కూడదూ?' అన్నాను. అందుకామె చిలిపిగా 'చెప్పెయ్యనా, ఏముందీ! అంతా డైటింగ్‌లో ఉంది' అన్నది.

## దేవిక

'మా చిత్రానికి రాష్ట్రపతి ప్రాంతీయ బహుమతి లభించింది!' అంటూ ఎంతో ఉత్సాహంగా చెప్పారు దేవిక.

ఆ చిత్రం తమిళచిత్రం. పేరు: వెగుళి పెణ్ (వెకిలిపిల్ల). ఈ చిత్రాన్ని ఆమె నిర్మించారు. ఆమె భర్త శ్రీ దేవదాస్ ఆ చిత్రానికి దర్శకత్వం వహించారు. తమిళ నాడులో విజయవంతంగా నడిచిన చిత్ర మది. 'సెలక్షన్‌కి వెళ్ళిన మూడు తమిళ చిత్రాల్లోను, మా చిత్రానికి బహుమతి రావటం నాకెంతో ఆనందాన్ని కలిగిస్తున్నది' అన్నారు దేవిక.

జూపిటర్ కంబైన్స్ పతాకం క్రింద నిర్మించబడిన ఈ చిత్రాన్ని ఇపుడు వారు హిందీలో నిర్మించే సన్నాహాలు చేస్తున్నారు. తమిళ చిత్రంలో ధరించిన పాత్రనే హిందీలో కూడా దేవిక పోషిస్తారు. రాజ్‌కుమార్ నాయకుడు. షర్మిలాటాగోర్ మరొక ముఖ్యభూమిక ధరించగలరని అనుకుంటున్నారు.

దేవిక చాలా ఫ్రీగా మాట్లాడుతారు. సెట్స్‌లో ఉన్నపుడు తాను నవ్వుతూ, నలుగుర్నీ నవ్విస్తూ ఉంటారామె. 'మీ వారికి తెలుగు వచ్చా?' అని అడిగాను. 'రాదు, కాని. ఆయనకి అర్థం అవుతుంది. వారి మాతృభాష సౌరాష్ట్ర. సౌరాష్ట్రకి లిపి లేదు. మన దక్షిణాది భాషలన్నీ కలిసే వుంటాయి అందులో. తమిళ, హిందీ, ఆంగ్ల భాషలు వచ్చు ఆయనకి.' అన్నారు, దేవిక.

'మరి మీరు తెలుగు నేర్పే ప్రయత్నం చెయ్యలేదా?' అని అడిగిన మరొక ప్రశ్నకు దేవిక సమాధానం చెప్తూ 'మొదట్లో కొద్దిరోజులు తీరికగా ఉన్నప్పుడు ప్రయత్నించాను. రెగ్యులర్‌గా చెప్పే పాటి తీరిక ఎక్కడిది?' అన్నారు.

దేవిక ఇపుడు మూడు తెలుగు చిత్రాల్లో నటిస్తున్నారు. ఒకటి: శ్రీ కృష్ణాంజనేయ యుద్ధం. రెండు: పాపం పసివాడు. మూడు: పరదేశంటి కాపురం. మొదటి చిత్రం ఈ నెలలో విడుదలవుతున్నది. చివరివి రెండూ కలర్ చిత్రాలు. నిర్మాణంలో ఉన్నాయి.

దేవికకు సింపుల్‌గా ఉండటమే ఎక్కువ అలవాటు అనుకుంటాను. పెద్దగా డెకరేట్ చేసుకోవటం నే నెప్పుడూ చూడలేదు. నగల ప్రసక్తి వచ్చినప్పుడు 'ఒకసారి దొంగలు వచ్చి మా అమ్మతో నగలు ఇక పెట్టుకోనని దేవుడిమీద ఒట్టేసి చెప్పాను. అంతే! అప్పట్నుంచి ఇప్పటిదాకా అసలు మళ్లీ నగలే ధరించలేదు. అది జరిగి ఇప్పటికి ఏనిమిదేళ్ళయింది.' అన్నారు దేవిక. ●



## జాతీయ చలనచిత్ర బహుమతులు: ఆరోగ్యకరమైన చిత్రాలు కావాలి!

19వ జాతీయ చలన చిత్ర బహుమతుల వివరాలను భారత ప్రభుత్వం మే మొదటి తేదిన ప్రకటించింది. ఉత్తమ చిత్రంగా సత్యజిత్‌రాయ్ నిర్మించిన 'సీమబద్ధ' బెంగాలీ చిత్రాన్ని ఎన్నిక చేశారు. ద్వితీయ ఉత్తమ చిత్రంగా 'అనుభవ్' చిత్రానికి బహుమతి లభించింది.

ప్రముఖ తమిళనటుడు శ్రీ ఎం. జి. రామచంద్రన్ (రిక్షా కారన్ చిత్రంలో నటనకు) ఉత్తమనటుడుగా ఎన్నికయ్యారు. ఉత్తమనటి బహుమతి వహీదా రెహమాన్ (రేష్మా అవుర్ షేరా)కి దక్కింది. ఉత్తమ దర్శకులుగా గిరీష్‌కర్నాడ్ బి.వి.కరంత్‌లు ('వంశ వృక్ష' కన్నడ చిత్రానికి) ఎన్నిక చేయబడ్డారు.

ఉత్తమ నలుపు తెలుపు ఛాయాగ్రాహకుడి బహుమతి ('అనుభవ్' చిత్రానికి) నందు భౌమిక్‌కి లభించింది. ఉత్తమ కలర్ ఛాయాగ్రహుడి బహుమతి సి. రామచంద్ర (రేష్మా అవుర్ షేరా)కి వచ్చింది. ఉత్తమ సంగీత దర్శకుడు: జయదేవ్ (రేష్మా అవుర్ షేరా) ఉత్తమ నేపథ్య గాయనీ గాయకులుగా పి. సుశీల (సవాలే సమాళి) హేమంత్‌కుమార్ (నిమంత్రణ్ —బెంగాలీ,) ఎన్నికయ్యారు.

* * *

మట్టిలో మాణిక్యం (తెలుగు) వెగుళి పెణ్ (తమిళం) వంశవృక్ష (కన్నడం) కరకనక్కడల్, (మళయాళం) ఫిర్ భీ (హిందీ), నిమంత్రణ్ (బెంగాలీ) అరణ్య (అస్సామీ) సంతతకోర్ట్ చాలూఆహే (మరాటీ) చిత్రాలు ప్రాంతీయబహుమతులు గెలుచుకున్న చిత్రాలుగా ప్రకటించారు.

డాక్టరు ని. కె. నారాయణ మీనన్ అధ్యక్షతలో 11 మంది సభ్యులతో ఏర్పడిన కమిటీ— ఈ అవార్డులను నిర్ణయించింది.

* * *

ఉధృతమయిన సెక్స్, భయోత్పాతం ఇతి వృత్తాలుగా ఏర్పడే ప్రమాదాన్ని గురించి దక్షిణ భారత చలనచిత్ర వాణిజ్యమండలి అధ్యక్షుడూ, సెంట్రల్ బోర్డ్ ఆఫ్ ఫిలిమ్ సెన్సార్స్ సభ్యుడూ అయిన శ్రీ ఏ. ఎల్. శ్రీనివాసన్ ఇటీవల హెచ్చరించారు.

'ఏ' సర్టిఫికేట్‌తో ఈమధ్య బొంబాయిలో విడుదలయిన రెండు హిందీ చిత్రాలు ఇటు ప్రజల్లోను, అటు పార్లమెంటు సభ్యుల్లోను తీవ్రమైన సంచలనాన్ని కలిగించాయి. వాటి మీద ప్రభుత్వం చర్య తీసుకుంటున్నది.' అని ఒక స్టేట్‌మెంట్‌లో చెప్పారాయన.

సెంట్రల్ సినిమాటోగ్రాఫ్ చట్టంలో ఏ (అడల్ట్స్ ఓన్లీ) సర్టిఫికేట్‌ను రద్దుచేసి, అన్నిచిత్రాలకు 'యు', (యూనివర్సల్ సర్టిఫికేట్స్) ఇవ్వవలసిందిగా సూచించారు. ఏ సర్టిఫికేట్ నిర్మాతలకు ఒక వరంగా తయారయింది. అందువల్ల యువకుల్లో ఉద్రేకమైన చిత్రాలు చూడాలనే ఆసక్తి జనిస్తున్నదని కూడా శ్రీ ఏ. ఎల్. శ్రీనివాసన్ చెప్పారు.

సెంట్రల్‌బోర్డు ఛెయిర్మెన్ పేరుతో ఈ 'ఏ', సర్టిఫికేట్ ఇవ్వటం వల్ల— సెన్సారుబోర్డు తీవ్ర విమర్శకు గురికావలసి వస్తున్నదనీ, చక్కని ఆరోగ్యకరమయిన చిత్రాలను నిర్మించవలసిందిగా పరిశ్రమకు విజ్ఞప్తి చేశారు ఏ. ఎల్. యస్. సెంట్రల్ బోర్డువారు ఇచ్చినట్టి సూచనలు ఇవ్వాలనీ, దేశమంతటికీ సెన్సారింగ్ విధానం ఒకేలా వుండాలని కూడా ఆయన కోరారు.

— మోహన్ కుమార్

## సినిమా అయ్యే మరొక నవల

నిర్మాతలకు నవలలపై మోజు ఏర్పడింది. 1972 లో తెలుగు నవలలకి డిమాండు పెరిగింది.



## సినిమా

(61వ పేజీ తరువాయి)

శ్రీధర్ ప్రొడక్షన్స్ 'ప్రేమసూత్రం' నవలకి తెరరూపం ప్రసాదిస్తున్నారు. ఈ కథ పాఠకలోకానికి బాగా తెలుసు. సినిమాకి పనికివచ్చే చక్కటికథ అనికూడా తెలుసు. ఆనందరామం విరచితమైన ప్రేమసూత్రం కథకి, భమిడిపాటి మాటలను వ్రాస్తున్నారు. ప్రముఖ దర్శకుడు కె. ఎస్. ప్రకాశరావు చిత్రానికి కావలసిన కొన్ని మార్పులను చేశారు ఈ చిత్రానికి రమేష్ నాయుడు సంగీత సారధి,

### హీరోగా శోభన్‌బాబు

'ప్రేమసూత్రం' కథానాయకుడిగా శోభన్‌బాబు కనిపిస్తారు. ఈ కథలోని రెండు నాయిక పాత్రలను శారద, జయంతి ధరిస్తారు. గిరిబాబు, సూర్యచంద్రరావులు వర్మిస్తున్న యీ చిత్రానికి స్క్రీన్‌ప్లే డైరెక్షన్ను కె. ఎస్. ప్రకాశరావు నిర్వహిస్తారు.

## ఒకే నటుడ్ని అడిగిన యిద్దరు తమిళ హీరోలు

తమిళంలో ప్రముఖ హీరోలుగా విరాజిల్లుతున్న శివాజీ, ఎం. జి. ఆర్. గార్లు తెలుగులో తమకొక చిత్రానికి పని చేసిపెట్టమని హీరో నాగేశ్వరరావును అడిగారట.

## నటుడు చేసిన సన్మానం!

అలనాడు కవులను రాజులు పోషించి, సన్మానించేవారట. ఇప్పుడు ప్రముఖ హాస్య నటుడు ఒక సినిమా రచయితను ఘనంగా సత్కరించాడు. ఏప్రిల్ 28 న మహాలక్ష్మి కళ్యాణ మండపంలో మధురవాణి సంపాదకుడు గోటేటి శ్రీరామరావుకు రాజబాబు గావించిన సత్కారం అట్టహాసంగా జరిగిందనే చెప్పవచ్చు.

విద్యావిశారద బిరుదాంకితుడైన గోటేటికి, రాజబాబు బరువైన పర్సునందచేశారు. పుష్పగిరి శంకరాచార్యులు, వెంకటేశ్వరానందజీ స్వాములవారు, బషీర్‌బాబా, ఎన్టీరామారావు, జగ్గయ్య, నాగయ్యగార్లు గోటేటి మంచితనాన్ని, అతనికలం బలాన్ని, స్నేహశీలాన్ని కొనియాడారు ఈ సన్మాన సభకి వెండితెర ప్రముఖులనేకులు వచ్చి, గోటేటిని ఆశీర్వదించారు. రాజబాబును ప్రశంసించారు.

ఒక జర్నలిస్టుకి ఒక ఆర్టిస్టు సన్మానం చెయ్యడం నాకు తెలిసి యిదే ప్రథమం. వరిశ్రమలో కొత్త సాంప్రదాయాన్ని నెలకొల్పారు, రాజబాబు.

శ్రీమతి కె. రాజేశ్వరి నిర్వహణలో సరికొత్త జానపద నృత్యాలతో, రాజేష్ అండ్‌పార్టీ మ్యూజిక్ నిర్వహణలో, విజయబాల, రాజులు పాడగా గంటన్నర జరిగిన ప్రోగ్రాము గోటేటి సన్మానసభకి కొత్త అందాన్ని యిచ్చింది.

—శ్రీనివాస్




Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1; and at Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3. Editor : S. Sambhu Prasad.




ఈ బస్సు పేరు విల్లో బ్రూక్ ఎక్స్‌ప్రెస్‌వే. ఇది ప్రయాణీకుల సంరక్షణ, సుఖం, సౌకర్యాలని దృష్టిలో ఉంచుకుని తయారుచేసిన వాహనం. బండిని ఎక్కుతున్న అమ్మాయి ప్రస్తుతపు "మిస్ యునైటెడ్ కింగ్‌డమ్" మేరిలిన్ వార్డ్. *


ASOKA
REGD
ALL PURPOSE
SANDAL WOOD
Powder
ASOKA
Sandalwood
TALCUM POWDER
ASOKA
SANDALWOOD
FACE POWDER
Natt.